Regd No. N. 45 / M 3813

౹ ఒక అణా




ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ విక్రమసం॥ శ్రావణ శు॥ ౧౩ (౬-౧౧-౧౩౫౦ఫ.) గురువారము సంచిక ౩౦

★ అసంఖ్యాక జర్మనీ విమానాలకు బ్రిటనులచేనష్టము ★

★ ఇటలీయులపై తిరుగుబాటు ★

# ఇండోచైనా ఆక్రమణలో జపానుకుగల ప్రయోజనము

## జర్మనీ, ఇటలీ, జపానుల రహస్యపు ఒడంబడిక!

### చైనాజపానును ప్రతిఘటించకమానదు

చైనానియంతయగుమార్షల్ చియాంగ్ కేషేక్ గారికి జపానుపైయుద్ధము సాగించుటకు తోడ్పడు ఎట్టిసామగ్రియుకూడ ఫ్రెంచివారి ఇండోచైనాగుండా పోనుండ్ర పెదమని మాటయిచ్చిన ఫ్రెంచిప్రభుత్వమువారు ఏర్పాటుచేయుచున్న కట్టుదిట్టములు సరిగానున్నదియు లేనిదియు పరీక్షించుచుండుటకై ఇండోచైనాకు జపాన్ ప్రభుత్వమువారు పంపిన అధికారవర్గము ఏదిగలదో దానిఅధ్యక్షులగు మేజర్ జనరల్ నిషిహారాగారు జపాను ప్రధాననగరమగు టోకియోకు పిలిపించబడిరని గతసంచికలో వినియుంటిమి. వారు జపానుప్రభుత్వమువారి ఆదేశములతో ఆగస్టు ౯ వ తేదినాడు హనాయికి తిరిగివచ్చినారు. ఆయాదేశప్రకారము ఆగస్టు ౧౨ వ తేదినాడు ఇండోచైనాయొక్క ఫ్రెంచిఅధికారులతో జపానుప్రతినిధులు రాయభారములు మరల సాగించబడినవి.

#### జపానుకోరికలు

ఇండోచైనాలో సైనికనివేశములు, నౌకానివేశములు, విమాననివేశములు స్థాపించుకొనుటకును, ఫ్రెంచివారిభూమిమీదుగా జపానుసేనలను యూనానురాష్ట్రమునకు పంపుటకును వారి అనుమతము కావలెనని జపానువారుకోరుచున్నట్లు తెలపడుచున్నది. మొదటతీవిధముగా ఇండోచైనానంతయు జపాను వశపరచుకొనుట సులభమగును. ఇండోచైనాలో జపానుసేనలు చేర్చబడుటవలన జపానుకు సయాము సన్నిహితమగును. జపానుసేనలనుకలిపి భూసేనలతోను నౌకాసేనలతోను సింగపూరుపైబడుటకు రహస్యముగా ఒకమాటఅనుకొనియున్నవని ప్రతీతి గలదు. ఆగస్టు ౯ వ తేదినుండి ౧౨ వ తేదివరకు వచ్చినవార్తలలో ఈసంగతులకు సంబంధముగల్గిన సమాచారమొకటి చిత్రమైనదిగలదు. అదిఏమనగా, ఇటీవల జపానురాయబారులు కొందరు జర్మనీ ప్రధాననగరమగు బెర్లినుకును, ఇటలీప్రధాననగరమగు రోముకును పోయినపుడు జర్మనీ, ఇటలీ, జపానులుకలిసి బ్రిటిషుసామ్రాజ్యముపై దెబ్బతీయవలెనని ఒకఒడంబడిక చేర్పుకొనిరట, ఇపుడుఇటలీవారు ఆఫ్రికాలో బ్రిటిషుసామ్రాజ్యమందలి సోమాలిలాండుపై దండయాత్ర సాగించుచున్నారుగదా. వారుఈవిధముగా సోమాలిలాండు, అడేన్ ఆఫ్రికాయందలి ఈ జిల్లాలపై దండయాత్ర సాగించుచు బ్రిటిషువారితో పోరాడుచున్న సమయమందే జపానువారు తూర్పుప్రాంతమందు ఇండోచైనాపై దెబ్బవేయుటకు సంకల్పించియున్నారని చైనావారలు తలచుచున్నారు.

#### చైనాబెదరింపు

జపానుసేనలు ఇండోచైనాపైకి దాడివెడలినచో చైనాసేనలు ఇండోచైనాలోకి ప్రవేశించగలరనియు, కొద్దిరోజులనుండి వరఫీరంగులతో సహాయిదు చైనాడివిజనులుఇండోచైనా సరిహద్దుపైనుండు క్వాంగ్సికిని యూనానికి సరిహద్దులకు హ్వాచేనుండి పంపబడినవనియు, ఒకవార్త వచ్చినది,

పశ్చిమార్ధగోళముతెలుపలి ఏ రాజ్యమువారికిగాని అమెరికావారు పెట్రోలు, ఇనుము అమ్మరావని అమెరికాప్రభుత్వమువారు గావించిన ఆజ్ఞ చైనాకు బాధకరముకానిదనియు, ఇప్పుడుచైనాలో కారులున్ను బస్సులున్ను చైనాయందే తయారుచేయబడు అల్కాహాలు, క్రూడాయిలు, డీసలుఆయిలు, బొగ్గుగాలి ఉపయోగించి నడుచుచున్నవనియు, ఇప్పుడుచైనాలో ఈ చమురులను తయారుచేయుటకై మరిరెండు కర్మాగారములుస్థాపించబడుననియు చైనాఅధికారులు చెప్పుచున్నారు.

మరియు జపానీయులు ఇండోచైనాపైకి దండెత్తుచో ఇండోచైనాప్రభుత్వమువారు ప్రతిఘటించవలెనని ఫ్రాన్సులో పేటైనుగారి ప్రభుత్వము ఆజ్ఞనొసగినట్లును, ఇంటోచైనావద్ద ఫ్రెంచివారికిపుడు అనేకములైన జలాంతర్గాములున్నట్లును, వాటికితోడుగా నుండుటకు సాధ్యమైనంతత్వరలో ఇంకనువిమానములను, యుద్ధసామగ్రిని పంపించుటకేర్పాటులు చేయబడుచున్నట్లును ఒకవార్తవచ్చినది కాని జర్మనీ ఇటలీలప్రభుత్వములు పేటైనుగారిని జపానువారలకోరికలను తీర్చవలసినదిగ ఒత్తిడిచేయగలరు అప్పుడు జపానుదాడులనెదుర్కొనుటకు పేటైనుప్రభుత్వమువారు సంకల్పించుకొనియున్న ప్రతిఘటనయత్నములు మానుకొనబడకతప్పదు ఆగస్టు ౧౦ వ తేది జపానుకోరికలకు విదేశాంగమంత్రి మాట్సుఓక్ గారు పత్రికాప్రతినిధులతో జపానుకోరికలకు ఫ్రాన్సులొంగుచున్నట్లే తెల్పుచున్నారు.

#### ఇండోచైనా సమీపమునుండలో జపాను బలము

ఇండోచైనాదగ్గర హైనాను,హైచే మున్నగు నివేశములయందు ప్రతిరోజునుజపానువారియుద్ధనౌకలువచ్చిచేరుచున్నవి. ఆగస్టు ౧౦వ తేదిఉదయము ఒకజపానునౌకాదళము స్వాటోసు ౧౫ మైళ్ళదక్షిణమునందుచైనా సేనలపై దెబ్బతీసెను. హాంగ్చాఅఖాతము, సయాంగుసాఖాఅఖాతము, వెంచౌరేవు, సాంమువో,లోయూన్ అఖాతము ___ వీటిపొడవున విదేశరాజ్యాలఓడలుసంచరించరాదనిజపానునౌకాశాఖవారుజూలై౧౫వతేది ఆజ్ఞగావించియుండిరి. ఇపుడుఆగస్టు౧౧వతేదిఅర్ధరాత్రినుండి హింగ్వాఅఖాతము, పిన్హాయిఅఖాతము,మీచౌపుసిపు,మాచే, పెన్సూ మాత్రమేగాక హైకోనుకర్ దీవి, పిరామిడ్డుపాయింట్,పిన్హై కెన్సపాయింటు=వీటినికూడకలుపు రేఖపొడవునజపానువారలుముట్టడివేసెదరుగనుక ఆప్రాంతములోనికివిదేశరాజ్యాలనావలురాకూడదని వైస్ అడ్మిరల్ షిమాడాగారుఆజ్ఞగావించినారు, ఈ విధముగా జపానువారిముట్టడిస్థానము మరికొంత హెచ్చింపబడినట్లయినది.

#### ఉత్తర చైనానుండి బ్రిటను సేన తొలగింపు

షాంఘాయిరేవు,ఉత్తరచైనాలోను బ్రిటిషువారుంచిన సేనలను ఇపుడుతొలగించినారు. ఈసంగతినిబ్రిటిషువారుజపానువారికి తెలియజేసినారు షాంఘాయిలో౧౫౦౦మంది బ్రిటిషుసైనికులుండిరి షాంఘాయిఅంతర్జాతీయప్రదేశము అక్కడనుండే బ్రిటిషుజనులను చైనావారిదోపిడినుండి రక్షించుటకై ఇదివరలో ఆ సేనలుంచబడియుండెను. కాని ఇపుడుచైనాకుజపానుకును యుద్ధముజరుగుచున్నందువలన ఇదివరలో బ్రిటిషు సేనలను షాంఘాయిలో నుంచిన ఉద్దేశ్యము ఇప్పుడుతీరిపోయినది. అందువల్ల బ్రిటిషుసేనలను షాంఘాయిలోనుంచి తీసివేసితిమని బ్రిటిషువారుఅనుచున్నారు జపానువారు బ్రిటిషువారి యీచర్యకుఅభినందించుచు షాంఘాయిలోని ఇతరరాజ్యాలవారుకూడ ఇట్లేతమతమసేనలను తొలగించగలరు గాక యని ఆశించుచున్నారు. ఇప్పుడు షాంఘాయిలో బ్రిటిషువారి రక్షణకార్యములను ఆకోరికవారు చూచుచుండునట్లు ఏర్పాటుచేయబడుచున్నదనియు, అమెరికా బ్రిటనులకుఈవిషయమై ఉత్తరప్రత్యుత్తరములు జరుగుచున్నదనియు తెలియుచున్నది. అమెరికావారు మాత్రము షాంఘాయినుండి తమనౌకలను సేనలను తొలగించరట ఇపుడు బ్రిటిషుసేనలకు బదులుగ షాంఘాయిలో అమెరికాసేనలు చేరుననియు, అందుకై ౭౦౦ మందిఅమెరికా సైనికులు షాంఘాయికిపోవుచున్నారనియువిని టోక్యోలో జపానువారలు భయపడుచున్నారు. ఇంకొకసమాచారమేట్లున్నదనగా జపానువారే షాంఘాయిలో బ్రిటిషువారి ప్రదేశమునుతీసుకొనవలెనని జూచుచున్నారు.

#### బ్రిటనుపై జపానుపత్రికల ఆగ్రహము

ఇవియిట్లుండ జపానులో బ్రిటనుపై ద్వేషమువృద్ధినొందుచున్నది జపాను ... సభయగు

## బ్రిటనుపై అసంఖ్యాకములైన జర్మనువిమానాలు

### బ్రిటిషువిమానాలనుచూచి జర్మనీవి పారిపోవుట

ఇకమిగిలినవన్నియు విమానాలదాడులే, ఆగస్టు ౫ వతేది బెర్బరామీదను, ఏడనుసముద్రములో బ్రిటిషుఓడలమీదను, బ్రిటిషు సోమాలిలాండుమీదను. మెల్సామాత్రుహ్ పైనను. ఆగస్టు ౭ వతేది సూడానులో గెబీటుమీదను, ఆగస్టు ౯ వ తేది ౧౦ వతేది ఏడనుసముద్రంలో బ్రిటిషుఓడలమీదను, ఆగస్టు ౧౦ వతేది సూడానుమీదను ఇటలీవిమానాలనుండి బాంబులువేయబడెను,

బ్రిటిషువారు ఆగస్టు ౭ వ తేది నాడు హార్గీసియామీదను, ఎల్వాకుమీదను, ఆగస్టు ౫ తేది ఉదయము జీలామీదను ఆగస్టు ౯ వతేది నెఘెల్లీమీదను, టోబ్రకు హార్బర్ మీదను, హార్గీసా, తుర్గారానుగోడ్డుమీదను, మసావామీదను, మాయెఅడాగామీదను, ఆగస్టు ౧౦వతేది లిబియాలో సిరెనెలియామీదను, ఇరిట్రియాలో బారెంటుమీదను విమానాలనుండియు, ఓడలనుండియు బాంబులువేసినారు. మాయెఅడాగామీద బాంబులువేయుటలో ఒక ఇటాలియనువిమానము నాశముచేయబడెను.

#### ఇటలీమంత్రివర్గము

ఆగస్టు ౯ వతేది ఇటలీమంత్రివర్గము సమావేశమై లిబియాలోను, తూర్పు ఆఫ్రికాలోను యుద్ధపరిస్థితులుండుటవల్ల ప్రత్యేకరాలకు శిక్షలను ఎక్కువచేయు విషయమాలోచించిరి.

"ఉయటు"లో ౧౫౬ మంది సభ్యులు ఆగస్టు ౯వతేదినాడు సభచేసి బ్రిటనును తీవ్రముగా దూషించు తీర్మానముచేసిరి. ఆతీర్మానము తూర్పుప్రాంతమునుండి బ్రిటిషువారి పలుకబడినితొలగించివేయవలెనని కోరుచున్నవి ఆగస్టు ౧౨వతేది జపానులో అనేకచోట్లలో సభజరుపబడి, బ్రిటను చర్యలనధిక్షేపించు తీర్మానములు చేయబడెను. టోకియోలో బ్రిటిషు రాయబారి కార్యాలయములోని జపానుజాతీయోద్యోగులు రాజీనామలనీయ వలెననియు, బ్రిటిషుప్రాంతమందలి యిండ్లలోపనిచేయు జపానువారలు వెంటనే ఆయుద్యోగములను వదలివేయవలెననియు ... చేయబడుచున్నవి జపానీలు బ్రిటిషు ... కార్యాలయమువద్దగో ... టోకియోలో బ్రిటిషు కన్సులు కార్యాలయములవద్ద పోలీసురక్షణ ... కానిజపానుప్రభుత్వవారు అది నిరాకరించిరి.

ఆగస్టు ౧౨వతేదినాడు టోకియోలో హైపార్కులో బ్రిటనుయొక్కద్వేషము వెల్లడించుటకై సభజరిగెను ఆసభలో జపానుపతాకము ప్రక్కనే జర్మనీ, ఇటలీలపతాకములుకూడ నుంచబడెను. బ్రిటిషువారిని దూషించు తీర్మానములు చేయబడెను.

#### అరెస్టు చేయబడిన జపానీయులు

ఆగస్టు ౧౨వతేదినాడు రంగూనులో అరెస్టు చేయబడినముగ్గురు జపానీయులలో ఒకరుజపానుకు పంపి వేయబడినారు

## కబాడీ పోటీ

హైదరాబాదు(దక్కన్) మెహరు ౯

నవాబ్ మెహదినవాజ్ జంగు కప్ బహూకరణనికిగాను కబాడీపోటీకుడిపందెము శుక్రవారము ౧౦ ఆగస్టువాడు సాయంకాలము ౫ గంటలకు ... (చాదర్ఘాట్ వాటర్ట్యాంక్ వద్ద) జరుగును. రాజా ధర్మకరణ్ బహద్దరుగారి సమక్షంలో ఈపందెముజరుగును.

పైపందెము నాంపల్లి వ్యాయామశాలవారికిని శివాజీక్లబ్ వారికిని జరుగును.

## హైద్రాబాదు నాయకులు గాంధీగారితో కలియుట

హైద్రాబాదు నేషనల్ కాన్ఫరెన్సు [భూతపూర్వ స్టేటు కాంగ్రెసు] నాయకులైన కాశీనాథరావు వైద్య, రామానందతీర్థ,సిరాజుల్ హసన్ తిర్మిజీ, దామోదరదాసుగారును వరకొందరును సేవాగ్రామంలో గాంధీగారిని కలిసినారు, రెండు నాలుగుయేండ్లు వారితో ముచ్చటించి ఆలోచనలు చేసినారు. హైద్రాబాదులోని ఇప్పటి పరిస్థితులను తెలిపినారు. స్టేటు కాంగ్రెసుపేరు మార్చుటను హైద్రాబాదు ప్రభుత్వమువారు కోరి తెలిపారే చేసుకొనుడాగుర్చిరి. కాని అప్పటికిన్ని దానిపై అంక్ష పెట్టినం వాగ్దానభంగములో చేరినట్లుగ ఇట్లుచేసినందులకు యీ నాయకులు ఊరకుండుతారా? ఈపనికై ఒకప్రణాళికసిద్ధముచేసుకున్నారని తెలియుచున్నది. రామానందతీర్థగారుమాత్రము కొన్నిదినముల తరువాత హైద్రాబాదుకు తిరిగి వచ్చినారు.

(యూ.పీ వార్త)

మా చిన్న కథ

# రామి

దిగవల్లి శేషగిరిరావు
సాహిత్యశిరోమణి
—ఉదయభారతి

నిన్న యీదారినుంచే రామిసాడేను స్మశానానికి మోసుకపోయారు వెంటచాలామంది గ్రామస్థులువచ్చారు. రామితల్లి ఎక్కువగా ఏడ్చినట్లే కనిపించలేదు.

సరే, ఆవిడఏమంతగా ఏడ్వలేదు. రామిబ్రతికివుండగా ఆమెకి ఏడవాలనే కోరికకలగలేదు, ఏడవలసిన అవసరముకూడాకలగలా. రామిజన్మతోనేకుంటిది.

రామిమరణానికిముందు జబ్బుపడలేదు. బహుశః ఈశ్వరునిదృష్టిలో అవిడఅంత మోహానైనదై యుండకపోవచ్చు. ఆవిడజబ్బు పడటమంటూవస్తే యింటివాళ్ళచేత చీవాట్లు. చెప్పు దెబ్బలుతప్ప యింకావేరే చికిత్సేవుండదు, ఆఖరికి దాహమైతే మంచినీళ్ళకుకూడా మోహం వాయాల్సిందే.కుంటివాళ్ళకూడా జబ్బుపట్టానికి అధికారంవుంటుందా?

అవిడ తిరగలి విసురుతోంది ఇంతట్లో వ్రేపాణాలు పోయాయి. అవిడగుండె నిబ్బరంలేందా చావవలెననిఅనుకోంటోందా అన్నట్టు, కుంటివాళ్ళకుకూడా హృదయంఅనేది వుంటుందంటే ఆశ్చర్యమే, ఎప్పుడైనా రామిహృదయాన్ని గురించి ఎవరన్నా మాటవస్తే యింట్లోవాళ్ళంతా నవ్వుకోంటూ వుండేవాళ్ళు. రోజంతాగడిపి వాళ్ళమ్మ రాత్రి పండుకోబోయేముందు విసరమని గోధుమలుయిచ్చిపోదామని గదిలోకి వచ్చింది, వచ్చేప్పటికే రామి తిరగలిపైపడివుంటంచూచింది. పరీక్షించింది నిగతజీవియై పడివుంటం.

రామితల్లికి గోధుమలువిసరకుండా వుండాల్సొచ్చాయె అనివిచారం వేసింది. తిరగలినికూడా గంగాజలంతో కడగాల్సొచ్చిందేఅనిపిచ్చింది. రామితనకు కూతురౌతుందని అప్పుడు ఆలోచనతట్టింది. యివ్వాళ్ళవరకు యీయోచన రాయందుకుతట్టలేదాఅని ఆశ్చర్యంవేసింది. మెల్లమెల్లగా రామినిలేవనెత్తి క్రిందపడుకోబెట్టింది. కొద్దిగా తెరచుకొనివున్నకళ్ళను పూర్తిగామూసేసింది. కొనేపుకూచొని ఏడ్చింది. తర్వాత అక్కణ్ణించిలేచి రామిమరణవార్త చెప్పటానికి బయటికిపోయింది.

రామిచనిపోవుటకు కొద్దిరోజులకుపూర్వం ఎప్పట్లాగా మళ్ళా అదేప్రశ్న వేసిందితల్లిని!! లాహోరుఎట్లావుంది, రైలుబండి ఎట్లానడుస్తుంది?"

తల్లిపూజ కోపంతో తిడుతూ అంది కుంటిదానికి నీకెందుకదంతా! రామి తల్లినడుగుటమానింది. తనచెల్లి, వదినను తమ్ముడు మణిని అడిగింది అదేప్రశ్న. ఒకపెట్టున నవ్వి[illegible]న్నారు, "నువ్వింట్లోనించి బయిటికేకదల్లేవు. చెపితేవినిఏంచేస్తావు?"

పిల్లలు ఆటలోనిమగ్నులయ్యారు. రామి కళ్లవెంట నీళ్లుకారాయి. ప్రపంచములో అవిటివాళ్లగతి అంతేగదా, పాపం పిల్లలెవరన్నా మాపి ఎక్కిరిస్తారేమోనని భయం. తల్లితోచెపితే చీవాట్లుపెడుతుందేమోనని జంకు. చీరచెంగుతో కన్నీరుతుడుచుకొంది.

రామిహృదయంకూడా తక్కిన పిల్లల హృదయంలాటిదే అనిపిస్తోంది అందుకే లాహోరు వెళ్లాలనీ, రైలుచూడాలనీ యింతమనసవుతోంది. వాళ్ళవూరు రైలుస్టేషనికి ఒకమైలు దూరంలోనేవుంది. రోజూ రైలుకూత రామిచెవుల్లో గింగురుమంటూ వినిపిస్తుంది. అశబ్దములో సాధారణ జనులకెవరికీ కనిపించని ఒకవిధంలాటి తియ్యదనంతోస్తోందిరామికి. ఆమెయొక్క ఊహ్వింగుచున్న సమస్తావేశాలకే అదేస్వరూపం ఈకూతకోసం ఏదురుచూస్తూ రామి ధ్యానంతో కూర్చుంటుందిరోజూ. రైలుకూతవినంగానే హృదయంలోని వేగాన్ని అణచివేసుకొంటుంది. ఆమెమనస్సులో అనాయాసంగా తరంగాలులేస్తాయి. ఆమెయొక్క సమస్తసుఖస్వప్నాలు యీకూతవేసే వస్తువేదోచూతామనే అనుభూతిలో కేంద్రితం అయిపోతూవుంటాయి.

ఆమెతల్లి, చెల్లి, సోదరుడు ఒకసారిలాహోరుపోయి వస్తూవుంటారు. రైలుకూత వినేప్పటికల్లా గుర్తొస్తోవుంటుంది. లాహోరుపోనీ కాళ్ళున్నావుంటే, తల్లినీ, చెల్లెల్ని పంపించటానికనే వంకన్నాపెట్టుకొని రైలుచూచివచ్చేది కాని పాపం, అనోముకూడా నోచుకోలేదు. ఏదోశాస్త్రప్రాకిపోగలదు. కాని, ఏంలాభం. అవిడ లాహోరుచూడాలనేదాహాన్ని, తీర్చటానికిదిచాలకండేను.

దాహం నీళ్ళుమాపించేటప్పటికి యింకా ఎక్కువవుతుంది. లాహోరునుంచి వచ్చాక ఎప్పుడూ వకి వారంవర కులాహోరునంగలి తమ పింతండ్రి గుణగానం చేస్తుంటూవుంటారు నవవా, మణీ, రామిధ్యానంతోకూర్చొనివింటూవుంటుంది ఏమైనప్రశ్నవుంటే కళ్లతో వేస్తుంది. మణి నేనేగదా చూచానుఅని తనగొప్పను పొగడుకుంటూ వుంటాడు. మాబాబాయికొట్టు ఏమనుకొన్నావు. చాలాపెద్దది. ఫర్షమీద చలువరాళ్లున్నాయి. అక్కడ పేపతో అలకాలినిన పనేలేదు గోడలపైన ఆకుపచ్చని పాలిష్, చూట్టానికిఎంతమనోహరంగావుంటుందనుకొన్నావ్ మన పొలాల్లోని పచ్చదనంలాగ. యింకా ఎలక్ట్రిసిటీ. నీకేంతెలుస్తుంది కుంటిదానికి! బటన్లు వుంటాయి నొక్కయ్యటంతో నే ఎక్కడపడితే అక్కడ దీపాలు వెలుగుతాయి. అక్కడ వేడి, వుక్కవుండదు ఉక్కపోస్తే బటన్వుంటుంది. దాన్నినొక్కగానే పంఖా భ్రమంటూ తిరుగుతుంది. అక్కడ చాలాకార్లు వుంటాయి; అద్దాలదుకాణాలు వుంటాయి; తారు రోడ్డువుంటుంది. నేనూ, ననదా, మేమేం, చుట్టానికి రోజూపోతూవుండేవాళ్లం. షికారుకుపోతూ వుండేవాళ్ళం. ఎంతహుషారుగా వుంటూవుండేదనుకున్నావ్? నీబోటి కురిమొద్దు అక్కడికివస్తే నిన్నుచూచి ఝడిసికొనిపోతారు. వాళ్లు పౌడర్అద్దుకొంటారు. చూచేందుకు ముచ్చటకస్తూవుంటారు. అని అనేకవిధాలుగా ఆచ్చటివింతలు చెప్పుకుంటూవుండేవారు.

కొన్నాళ్ళవరకు రామిమనస్సు లాహోరునుగురించిన స్వప్నాలుకంటూవుండేది. రామియొక్క దృష్టిక్షేత్రం హద్దుగలది. లాహోరునుగురించిన ఆలోచనలు చాలారోజులవరకు మనసులో ఆపుజేసుకోలేకుండా వుండేది. కాని రైలుకూత, కేవలం ఒకమైలుదూరంనుంచే వినిపించే రైలుకూత ఎన్నడైన ప్రాకులాడుచూడనైనాపోగలదా అక్కడికి............

× × ×

రామి తల్లికి రామియొక్క యీసుఖస్వప్నాలనిగురించి తలచేఅవశ్యకతే కలగలేదు. ఆమెదృష్టిలో రామి ఒక మూర్ఖురాలు. తెలివితక్కువది.అనుభవహీనురాలు, లెక్కింపదగినదికాదు. యింటిలోని అంట్లుఅన్నీ తోముట, తిరుగలివిసరుట, ఏమన్నా ఖాళీవుంటే దారంతీయుట ఇది రామిగినచర్య. అంట్లు తోముతూ తోముతూ ఎప్పుడన్నా కాసేపు అలసటతీర్చుకోటానికి కూచుంటుంది— మళ్లా అదేరైలుకూత! గాలిగుఱ్ఱంపై స్వారీచేసి రైలువద్దకు చేరుతోవుంటుంది ఇంటివాళ్ళతిరస్కారం, ప్రపంచమందలి ఉదాసీనత, గ్రామస్థులు తన్నుజేయుపరిహాసము సమస్తం మరచిపోతుంది. రైలు, తన స్వప్నప్రపంచం—ఆప్రపంచంలో తన్ను వెక్కిరించువారుండరు; కుంటిది కుంటిదిఅని అరచేవారుండరు; వేధించి విసుగెత్తించి ఏడ్పింపజేయువారుండరు. ఇంతట్లోకే ఆకస్మికంగా తనతల్లియొక్క కఠోరమగు తిట్లవర్షం పడుతుంది. స్వప్నాలుచెదరిపోతాయి. కేవలం మర్మంతోనిండియున్న ఏకాగ్రదృష్టితో తల్లినిమాట్టం, తనయొక్క చారెడేసి కన్నులనుండి బొటబొట కన్నీరుకార్చటమే, తల్లియొక్క కఠోరశబ్దాలకి జవాబు. కుంటివాళ్ల దగ్గర యింతకంటె విశేషించి ఏం జవాబుంటుంది?

రాత్రి చాలప్రొద్దుపోవువరకు తిరుగలివిసరుతూ తన తిరుగలియొక్క గరగరశబ్దముతో తన సమస్తదుఃఖాన్ని మరచిపోవటం నేర్చుకుంది. చీకటికోణంగావుండే తన[illegible]పాటి టిక్కిలో నే ప్రపంచం తల్లి తిరస్కరింపబడ్డరామికి తనఊహాప్రపంచాన్ని నిర్మించుకొనేందుకు అవకాశం దొరుకుతూవుంటుంది. పిల్లలు ఆడుకొంటూపాడుకొంటూ ఆనందంగావుండుటను చూచినప్పటికీ తనహీనత్వాన్నిగురించి చింతించదు. దీన్నంతా స్వప్నంగాతలచి, తనసుఖస్వప్నాన్ని వాస్తవికమైన ప్రపంచవిషయాలుగా తలుస్తోవుంటుంది. ఇటువంటి సమయాల్లోనే రామిసౌఖ్యాన్నిఅనుభవిస్తూ, భగవంతుణి విశ్వసిస్తూవుంటుంది. వూళ్లో పిల్లాళ్ళచే పరిహసింపబడకుండులాగున ఏదోపని అప్పజెప్పి తనను విచారంకలుగనివ్వకుండా చేసినందుకు మనసులో అప్పుడప్పుడు తల్లికి ధన్యవాదాలర్పిస్తూ వుంటుంది. తల్లి తన్నొకమనిషిగాకూడా వెక్కిరించుకోటన్లేదనే విషయాన్నికూడా మరచి యీవిధంగా తనతల్లి తన క్షేమానికే చేసిందనుకొంటుందా వెర్రిపిల్ల. తల్లిదృష్టిలో యీవిడ వక్రపేరేపింపబడిన మిషను, కదలలేదు మెదలలేదు ఏమన్నా తిట్టినా మెదలకుండా పూరుకుంటుంది. ఆమె ఏడుస్తువుండగా ఎవరూ చూడలేదు. అట్లాంటప్పుడు యీవిడకీపని ఎందుకు వప్పజెప్పరాదు?

రామికీ, ఆమెతమ్ముడు, చెల్లెలికీ ఎప్పుడూ సరిపడదు ఎప్పుడూ రాము వాళ్ళని ఏమీఅనే ఎరుగదు. అనుటకు సాహసమూలేదు. కోరికాలేదు పిల్లలు తల్లినిచూసి రామినితిట్టుట,మాటిమాటికి దనయొక్క హీనత్వాన్నిగురించి తెలుపుడి చేయుచుండుట నేర్చుకొన్నారు— రామిని ఆవిధంగా అంటూవుంటూ నేవాళ్ళకి హుషారుగా వుంటూవుంటుంది. ఎప్పుడన్నా వకవేళ ఖర్మవశాత్తు చక్కగామాట్లాడినప్పటికీ యీవిధం దయదలచి అంటూన్నట్టు మాట్లాడేవారు. రామితల్లి ఎప్పుడూవాళ్ళని రామితో కలిసివుండనివ్వదు: రామియొక్క క్షేమాని కనుకొంటారేమో! కాదుకాదు పిల్లల బాగుకోసంమాత్రమే.

× × ×

పల్లెటూరివంద చేతఅందరికీశౌచాదికృత్యాలు నెరవేర్చుకోటానికివూరవతలగల పొలాల్లోకిపోవాలి సొస్తుంటుంది. రామి ప్రాకులాడుచూబయటికివచ్చిందాంటే వూళ్ళోపిల్లలంతా వెక్కిరించడం ప్రారంభిస్తారు, యిద్దరు ముగ్గురు పిల్లలు అవిడలాగే ప్రాకటం మొదలెడ్తారు. రామికి అప్పుడుతనస్థితినిగురించి ఏడ్పువస్తుంది ఆమెవివశత్వంవల్లాకన్నీరు బయటికి కండ్లచివరకి రావటం, అరిపోవడం పిల్లలకిఝుసి ముసిముసీ చీకట్లోనేరుపుకున్నూ ఝుడుస్తూ పొలాల్లోకిపోతుంది కాళ్ళుకొంకర్లుపోవునట్లుచేయు శీతాకాలపు రాత్రుల్లోకూడా పిల్లలవెక్కిరింపులభయం రామికిబాగాచీకట్లోనే పోకిపోవుశక్తినిస్తూవుంటుంది.

రామిపొద్దుపొడవగానే తనచీకటి టిక్కి[illegible] రణుచేస్తుంది. ఎండవస్తుంది బయటచెట్టుకింద పిల్లలుగుంపులుగుంపులుగా ఆడుకొంటూ వుంటారు రామిఆకిటికీ చువ్వలసందునుండి తొంగితొంగి చూస్తూవుంటుంది పిల్లలుఆటలుపాటలు చూచి చూచి వకప్పుడుసహించలేక పోతూవుంటుంది అప్పుడువెంటనే రెండుకళ్ళుమూసుకొని మంచంమీదపడుకొంటుంది. కుంటివాళ్ళతమ హృదయాన్ని యీవిధంగానే సంతోషపెట్టుకొంటూవుంటారు,

చనిపోవునప్పటికి రామివయస్సు ౨౮. మొదట్లో రామివున్నవూళ్ళో రామగోపాలనేడివకవృద్ధవడ్రంగి వుంటూవుండేవాడు. ఆసువకసిద్ధవైద్యుడనిఅతడు చెప్పుకోలేదు కానివూళ్ళో అందరికీ అతడిదగ్గరకొన్నినమ్మకమైన, బాగా పనిచేసేచిట్కాలు వున్నాయని తెలుసు. చాలామందికిఎముకలువిరిగితేనూ, కాళ్ళుకంకర్లుపోతేనూ యింకాయింకాకొన్ని పెద్దపెద్దజబ్బులు కొద్దికాలంలోనే కుదిర్చాడు - యితే యిట్లాంటివైద్యుడు తనవూళ్ళోనేవుండగా రామితల్లి రామికిఎందుకుమందిప్పించిబాగు చేయించలేదు? పిలిపించింది కాని జేరుంకుదురలేదు. రామగోపాలుబీదవాడు, మందుఖర్చుకూడా తానేభరించి జబ్బులుకుదిర్చేటంత ఉచ్చస్థితిలోలేనివాడు. రామగోపాల్ రామితల్లితోతన్నిపిలిపించినప్పుడన్నాడు. రామికితప్పకనెమ్మదిస్తుందనిచెప్పజాలను, కానిభగవంతునిదయఅంటూవుంటే ఒకనెల రోజులలోగానే బాగాతిరుగొచ్చు. రామితల్లికి యీమాటనచ్చలేదు. ఈశ్వరుడిమీదే నమ్మకం లేనప్పుడు యీశ్వరుని దయమీదనమ్మకంయెక్కడ? ఒకవేళజబ్బుకుదురకపోతే మందుఖర్చు యిర్వైరూపాయీలు దండుగఅవుతవి. ఇందుకోసంయింతడబ్బు ఖర్చుపెట్టయిష్టమేలేదు.

నిజంగా రామితల్లి దరిద్రురాలైనట్టయితే పోనీఅనుకోవచ్చు. పెద్దఆస్తిగలదు ఆస్తివుండియీఖర్చుతనకొక లెక్కలోనిదికాకపోయినప్పటికికూడా రామితల్లికి ఖర్చుపెట్టుటకు యిష్టంలేకపోయింది, రామిఅందర్లోకిపెద్దది. రామి పుట్టకపూర్వం ఆమెతల్లికి తొలిచూలి మొగపిల్లాడుపుడతాడని పెద్దఆశవుండేది. రామిపుట్టగానే ఆ ఆశలన్నీ అడుగంటాయి. ఆడపిల్ల, అందులోకుంటిది! రామితల్లికి మొదట్లోనైతే కొన్నాళ్ళు దుఃఖంగానేవుండేది కానిచివరకు తనకుతనే ధైర్యం చెప్పుకోసాగింది—కుంటిపిల్ల, పెళ్ళిఖర్చావుండదు, పెళ్ళిచేసుకోనేవాళ్ళేవుండరు. రామికిరోజుకు రెండుమారులు రొట్టెతోసరి.

... ... ...

లాహోరులోగల ఆమెపింతండ్రిదగ్గర రామినిగురించినచర్చ వకమారువచ్చింది ఒక్కటే ఒక్కసారి వాళ్ళుదీనిలనఁగతులు విచారించేవారుకారు. వాళ్ళకివాళ్ళఆఫీసుపనితోనేకాలం సరిపోతుంది సాయం[illegible]మాకిపోవటమూ టెన్నిసుఆడటమూ [illegible] పేకాడటమైయిష్టం. అప్పుడు వాళ్ళచంటిపిల్లాడికిసుస్తీగావుంది రామికిఏంచికిత్స చేయించారని రామితల్లిని అడిగారు. మొదట్లోతల్లిమాటను తప్పించాలని చూచింది, కుంటివాళ్ళకేవతంను పెద్దచికిత్సలు కూడానాలన్నట్టు కానిఇంతలోనే మమత్వంఅనేకలకలేసి రామగోపాల్ సంగతంతాచెప్పింది అందుకుపింతండ్రి కుదిరితేఫరవాలేదు. యిర్వై రూపాయీలలోపోయేదేమీలేదుకానియీపల్లెటూరి వైద్యులను నమ్మరాదు ఒక్కొక్కప్పుడు వాళ్ళవల్ల ప్రస్తుతస్థితికంటెదుస్థితికూడా సంభవిస్తోవుంటుంది. అదిగాకరామి తనకుంటితనంవల్లబాధపడుతోన్నట్టే ఎవరూఅనుకోవటంలేదు, దానికి బాధేలేనప్పుడు యీకుదిరీకుదురని మందు లెందుకు. ఏదోఅట్లాగే కాలక్షేపంనిర్విచారంగా చెయ్యనివ్వక"అన్నాడు. అవును, మరిపెద్దపెద్ద ఉద్యోగస్థులమాటలు యిట్లాగేవుంటాయి.

ఆయనకి యింకోభయంకూడావుంది. ఒకవేళ గట్టిగా మందిప్పించమనిచెపితే అభారం తననెత్తిపైకేమన్నా వచ్చిపడుతుందేమోనని. ఒకవేళ రామగోపాల్ మందిస్తాడు కుదరకపోవచ్చు. ఖర్చుచేయించమని లాహోరు తీసుకవచ్చి తనయిట్లోదిగబెట్టుటమంటూవస్తే పింతండ్రి కళ్లలా ప్రాకుచున్న రామియొక్క రూపం కనిపించిని వణికిపోయాడు. ఇంకొకటి పల్లెటూరివాళ్ళెట్టిఅమాయకులుగావుంటారు పోనీవకవేళ రామియొక్కకురూపం. తెలివిలేమిని చూచి బంధువటంచేత సహిస్తేసహించవచ్చును. కాని ఒక్కడవుంటే అవిడకే కష్టంగావుంటుంది. గడిగోళ్ళుడ్చుకొంటూ తిరుగుతుంది. తివాసీలు కంబళీలు పాడవుతవి. ప్రతిరోజూ అనేకమంది గొప్పగొప్పవారు ఆయన్ని కలుసుకోటానికి వస్తూవుంటారు, వాళ్లేరామిని చూట్టంవస్తే ఏమంటారు వాళ్లవూళ్లోవుంటేనే నయం.

రామికి తనచిన్న ప్రపంచాన్ని చూట్టానికి ఎక్కువసమయం కావలసినఅవసరంలేదు. తెల్లవారుఝామున శౌచాదికర్మలకు పొలాల్లోకి వెళ్ళేప్పుడు మహాభయంతోవుంటుంది. ప్రొద్దుపొడకముందే తిరిగిరావాలి యీకొంచెంసేపులో అడికిసుఖ[illegible]ఎక్కడ! మధ్యాహ్నపుటెండ. [illegible]యందలి గాలియొక్క మనోహరమగు రాగము పొలములందలి కళకళలాడుమొక్కలు దూరంపలి రైలుకూత, ఆమెజీవితానికి సాఫల్యన

(౯వ పేజీచూడుడు)

# బిదరు అగ్ని కాండ విచారణ ముగిసినది

## ౨౩ మందికి జెయిలు శిక్షలు

[illegible] అల్లరి, కొంపలుకాల్[illegible] మున్న గునేరాలు చేసిరని ౨౫మందిమున [illegible] బిదరులగ్ని దహనకాండ సందర్భములో పట్టుకొనియుండి బిదరులోనే మునిసిఫుగారివద్ద విచారణముగిసెను. అందు ౨౩మందికి రెండేండ్ల జెయిలుకఠినశిక్షయున్ను ౫౦౦రూ॥ (జుర్మానా)అపరాధమున్ను విధించిరి. నలుగురికి ౨ఏండ్లకఠినశిక్షయున్ను ఏదైదునూ రాయిల జుర్మానాయున్ను విధించిరి. ఇద్దరు వదలివేయబడిరి. మునిసిఫ్ గారువిచారణను అన్ని పక్షాల పరీక్షించినామనియు. ఇట్టితప్పుచేసినవారి కి కఠినంగాశిక్షించవలసినదే అనిన్నీ. సంఘాన్ని ముట్టివారిదుండగాలనుండి రక్షించుటకై వీరిపై కనికరంచూపకూడదనిన్నీ వ్రాయుచూ తీర్పు చెప్పిరి.

## సంస్కృతాంధ్ర కళాశాల

(విలేఖరి) వరంగల్ ౨౩జూలై.

ఈపట్టణమున ప్రమాదిసం॥ జ్యేష్ఠబ౧౧రోజున స్థాపించిన పైకళాశాలయొక్క ప్రథమ వార్షికోత్సవము వి॥క్రమసం॥ఆషాఢబ౹౹౪జ సువారము సాయంత్రము నాలుగుగంటలకు శ్రీ రామలింగేశ్వర దేవాలయమున బ్ర॥శ్రీ. పండిత పులిపాక మహానందీశ్వరశాస్త్రిగారి యధ్యక్షతక్రింద నత్యంతవైభవము గాజరుపబడెను. ప్రథమమున బ్రశ్రీ చాగంటి భాస్కరలింగశాస్త్రిగారిచే దైవప్రార్థన జరుపబడి యనంతరమన్యత్రులవారిచే మహావాణియు సంస్కృతవిద్యను గూర్చి యుపన్యసింపబడెను. పిమ్మట కార్యదర్శిగారు ముదిగొండ శంకరశాస్త్రిగారిచే గతవార్షికనివేదిక సమర్పింపబడి సంస్కృతాంధ్రవిద్యలయొక్క యావశ్యకత్వము, కళాశాలాభివృద్ధి మార్గము, విపులము గావిశదీకరింపబడెను, తదుపరి భిషగ్వర చాగంటి భాస్కరలింగశాస్త్రిగారిచే విద్యావిధానమును గూర్చియు, కళాశాల విద్యార్థియగు శ్రీరాంచంద్రమౌళి గారిచే కళాశాలాస్థిరత్వమునుగూర్చి యుపన్యసింపబడి౹ పిమ్మట గతవత్సర కార్యనిర్వాహకవర్గమే తిరిగియెన్నుకొనబడి కొంతమంది ప్రముఖులచే చందాలువేయబడి సభ జయప్రదముగా ముగించబడెను.

## మైసూరు మహారాజాగారి మరణంచే శోకసభ

హైదరాబాదుదక్కను ౬; ౩-౧౧-౪౯ ఫ.

శుక్రవారంనాడు సాయంత్రం ౭ గంటలకు, ఆసిఫునగరంలో హరిజనసేవాసంఘము గతరాత్రిపాఠశాలపక్షమున మైసూరు మహారాజాఅగు హిజ్ హైనెస్ శ్రీకృష్ణరాజాఒడయార్ గారుఅకాలమృత్యువుచే ప్రశ్రెందినందులకు శోకసభయేర్పరచి విషాదతీర్మానమును ఏకీభవంగా ఆమోదించిరి.

## ప్రకటింపబడని వ్రాతలు

ఈక్రిందివిషయములనుగూర్చి మాకుచేరియున్నట్టి వ్రాతలను ప్రకటించజాలనందుకు విచారపడుచున్నాము.

౧) సనాతన ధర్మసభలు-సిద్దిపేట శాఖాసంఘప్రచారము

౨) నారిపుండ్లబాధ

౩) సికింద్రాబాదు సారస్వతపరిషత్తు యాజమాన్యమున ఉపన్యాసపు ఏర్పాటు ఈలేఖచేరి నప్పటికే (కాలముదాటినది)

౪) జిన్నాగారు యేమిచేసినారని ౬ మార్చున?

౫) ఆహింసాపరిణామము

౬) "స్టేటులో శారదాశాసనము"

౭) తాశూర (సిరిసిల్లతాలూకా) కాలమానము

౮) సిరిసిల్లతాలూకా బావిగతిఏమి?

౯) వీరాభిమన్యు హరికథ

౧౦) మెదకుతాలూకా చందంపేటలో సమాధి సుడియగుట

౧౨) మరిజెల్, కల్వకుర్తి, రాలుపాగల, రామరెడ్డిపల్లి, మఖ్తలు: మరికలు, ధన్వాడ, లాల్‌కోట గ్రామాల కర్వాల సమ్మతితో పెద్దకిర్వగారి మహజరు (ఇందులో పాట్రాములశాఖాధికారులనుగూర్చి షికాయతు లున్నవి కీ[illegible] వివరమైన సాక్ష్యముతో రుజువుచేయగలవారు బాధ్యతవహించి, వారిపేరుతో సహా ప్రకటించుటకు అనుమతించుచో శాసనవిరుద్ధ భాగాలు మాత్రము తొలగించి ప్రకటింతుము)

౧౩) హిందూప్రజామండలి వతివా[illegible] కోదమము (ఈసంబంధమైన చర్చ యింతకుముందే అ[illegible] వేయబడి ది.

౧౪) బాలయోగి విరాగము (ఇందులో ప[illegible] యోజనకరమైనది చాలస్వల్పము)

౧౫) ఈదులూరులో టపా ఎత్తివేయక దని మెలు

౧౬) కామారెడ్డితాలూకా కర్షకులస్థితి

౧౭) నాగరకర్నూలు తాలూకా కుమ్మె[illegible] గ్రామం పోలీసువారి దుండగములు

౧౮) భువనగిరి తాలూకాలోని రేనుకుం[illegible] గ్రామంలో......? అక్షరాలు సరిగా తెలియటలేదు.

౧౯) కీర్తిప్రదులైనవారిని అన్యాయము ఒకరజకుడు నిందచేయుట (సిద్దిపేటతాలూ[illegible] రాజగోపాలుపేట)

౨౦) సనాతన బాల్యవివాహనిషేధ నిరప్రచారము

౨౧) దెయ్యమాధవరము మింజాలు [illegible] కుపటేలుగారిపై షికాయతు

౨౨) మునగాల జమీందారు రైతులు

౨౩) సూర్యాపేట సంస్కారవిన[illegible]

౨౪) సిరిసిల్ల తాలూకాలోని మ్మరెడ్డి[illegible] మంలో కాలమానము

## ముసాఫిర్‌ఖానాముందు వాద్యము

జేలుశిక్షలు-జుర్మానాలపై మురాఫా

(ఓ. వి.)

ఇచ్చోడ, షహరేవరు౬౧

ఆదిలాబాదుజిల్లా, బోధు తాలూకలో ఇచ్చోడ అనేగ్రామమునుగూర్చిగత ౧౫౪౯సంచికలోవచ్చినవార్తలోచెప్పిట్లుగనొప్పభూస్వాములు గౌరవకుటుంబముగలవారలగులోక నారాయణరెడ్డి,నిమ్మలభూమన్న,నిమ్మలసీవన్న,కల్లెంభోజన్న అనువారునుమరినలుగురు మాదిగ[illegible] రును౨ మునోరేగిపుసందర్భములో ముసాఫిరుఖాన "మసీదు" ముందటినుంచి బాజావాయించిరనియు, మరియు కానిష్టేబిల్ పైనతిరుగబడిరనియు నేరములుమోపిపోలీసు చాలాకవ్యవహారములు సాగించగా,బోధున్యాయస్థానములో తేది౨౦.౯.౪౯ న "మసీదు"ముందుబాజావాయించినందుకు ౮మందికి తలా ఒకవారమును,పోలీసుపై తిరుగబడిరనునేరమునకై ౪రు భూస్వాములకు ౧ నెలకఠినశిక్ష, ఒకవందరూపాయిలు జుర్మానాయువిధించియుండిరిగదా.అట్టిసందర్భములో కఠినశిక్షఅనుభవించుటకు జిల్లా ఆసిఫాబాదుకు నల్గురుయువకులను సంకెళ్ళువేసుకొని, పోయిరి. వీరికొరకు పైరవి మురాఫాచేసేవారే లేకుండిరి.కాని నిమ్మలచన్నన్న, యెన్నలచన్నన్నయు, జిల్లాకోర్టులో మురాఫాచేసి ౪రు గురిని జమానతుపై విడుదలకావించిరి.పేషి ౨౯.౧౦.౪౯న వేయబడెను. శ్రీమాన్ ప.పైకాజీ బ్యారిష్టరు,శ్రీమాన్ ప. లక్ష్మీకాంతరావు బ్యారిష్టరు. శ్రీమాన్ ప. చల్లగోవిందరావుగారును వాదించిరి.

పోలీ సు సాక్ష్యము లలో [illegible] లుగున ల్గురిర్ల సాక్షమిచ్చిరనియు, నేరవ రజువైనదికాదనియు, న్యాయాధికారితీర్పు [illegible] స్పెను అది మసీదుకాదనువాదమునుగూర్చియు ౧ వారం శిక్షవుగ.రించియు మల్లి మురాఫా హైకోర్టులో పెట్టుచున్నారు.

## వైస్రాయిగారినుండి ఎం. మున్షీగారికి ఆహ్వానము

బొంబాయి అగస్టు ౧

తనతో సంభాషించుటకు వైస్రాయి భారనాయకులలో చాలమందిని మళ్ళీఆహ్వానించుచున్నాడు. బొంబాయికాంగ్రెసు ప్రధాన నాయకులలోఒకరైన కె.ఎం. మున్షీగారికికూడ ఆహ్వానమువచ్చినది. మున్షీగారు యీనెల ౧౭వ తేదీన బొంబాయిలో వైస్రాయిగారితో మాట్లాడుదురు

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర శ్రావణ శు॥ ౧౩
గురువారము


## జాగీరు ప్రజాసంఘము

ఈ సంవత్సర వైశాఖ శు॥౧౦ నాటి మాసంపాదకీయములో జాగీర్దారుల సభనుగురించి చర్చించుచు తుదిలో నిట్లు వ్రాసియుంటిమి. "జాగీర్లలోని ప్రజలు ఇప్పుడైనా ఒకసంఘముగా ఏర్పడగలరు...... జాగీరుప్రజలు తమ సంస్థను ఏర్పాటుచేసికొనకున్న వారికిక నిష్కృతి యుండదు. మేము పదిమారులు జాగీరుప్రజలను హెచ్చరించి విసుగుచెందినాము. ఇక యీవిషయాన్ని గురించి చర్చించిన వృథా పరిశ్రమయగును."

ఈవాక్యాలు జాగీరు ప్రజాప్రముఖులకు నూటిగా తగిలెనో యేమో అన్నట్లుగా అమర్దాదునెల ఆరంభములో జాగీరుప్రజల సంఘమొకటి హైద్రాబాదు నగరములో స్థాపింపబడెను. తరువాత జేష్ఠ అమావాస్యనాడు (౩౦ అమర్దాదు)నాడు సంఘసభ్యులు నియమావళిని నిర్ణయించిరి అవి యిప్పుడు ఉర్దూలో ముద్రింపబడినవి. ప్రతిఒక్కటికి ౧ అణా. మేము పరిశోధన చేసినట్లుచేసి దొరకుస్థలాన్ని గుర్తించి ఒకఅణాపంపి యీనియమావళిని తెప్పించుకొంటిమి. ఈచిన్నమాటకూడ వ్రాయుట యెందుకన చిన్నచిన్నవిషయములేమన పనితనాలను పట్టించును. ఆంధ్ర- హిందూ మహాసభల చర్చ హోరాహోరిగా జరుగుచున్నది. మధ్యవర్తులు వీరశైవులవలె జోరుగా వాదించుకుంటున్నారు. కాని తత్సంబంధీకులుమాత్రం వీరవైష్ణవులవలె బిర్రబిగిసి కిమ్మనక కమ్మనక కూర్చున్నారు. మనయీ జాగీరుప్రజా సంఘమువారును నియమాలు చేసుకొని గుర్రాల అమ్ముకొన్న బేరగాండ్లవలె చల్లగా నియమాలను నెత్తిక్రింద పెట్టుకొని నిద్రించుచున్నారు.

"మేమీపనిని చేయుచున్నాము. సభ్యులుగచేరుటకు ఇవిగో ఫారములు. ఉర్దూలోను ముల్కీభాషలలోను వీటిని అచ్చుకొట్టినాము. మాకార్యాలయ మిచ్చటనున్నది. అవసరమున్నవారు వచ్చి టికివచ్చియో వ్రాసియో తమకోర్కెలను తెలుపుకొనగలరు. నియమావళిని అందరికి తెలియుటకై మూడు ముల్కీ భాషలలో అచ్చుకొట్టినాము." అని వివరాలను పత్రికలద్వారా తెలుపుకొనవలెను.-- తామేమిచేయుచున్నారో పదిమందికి తెలియవలెను. ప్రజాహిత సంస్థలు తెరచాటులోని ఆరాధనవస్తువులుకావు. ఈసంఘానికి కార్యదర్శి యెవరో కార్యాలయమెద్దియో జనులకు తెలుపకపోయిరి. ఇకనైనను ప్రచారముచేయుటలో మంచి శ్రద్ధవహింతురని ఈ సంఘనిర్మాతలతో మనవి చేసుకొనుచున్నాము.

ఈ సంఘముయొక్క ఉద్దేశములు మూడు.

౧. జాగీరుప్రజలలో ఐకమత్యము పరస్పర సహానుభూతి కలిగించుట.

౨. ఖాల్సా రైతుల కేసౌకర్యాలున్నవో వాటిని జాగీరుప్రజలకును లభించుటకై ప్రయత్నించుట.

౩. జాగీరుప్రజల సర్వతోముఖాభివృద్ధి.

మొదటిది- మూడవది అయిన ఉద్దేశాలు ౨౦ ఏండ్లక్రిందట ఏర్పడిన ఆంధ్రజనసంఘమువారి "ఐకమత్యము" "పరస్పర సహానుభూతి" "సర్వతోముఖాభివృద్ధి" అనే సమాస పరంపరతప్ప వేరేకానేరవు. ఆంధ్రజనసంఘనేతలచేయి యీ నియమావళి కూర్పులో బాగుగాపడినదని యీప్రథమ తృతీయ నియమాలు తెలుపుచున్నవి. మిగిలినది రెండవనియమము. అదే ముఖ్యమైనది. అదికూడా చాలా చిన్నకోరిక యే. ఈ చిన్నకోరికయే జాగీరుప్రజలపాలిట చాలాగొప్ప గొంతెమ్మకోరికవలె ఈనాడు కనబడుచున్నది. కాని యీసంఘమే బాగుగా దిట్టముగా పట్టుదలతో పనిచేసినట్లైన అయిదారేండ్లలో నేయీ కోరికలు పూర్తిగా నెరవేరగలవు.

ఈజాగీరుప్రజాసంఘములో ఎవరు చేరవలెను? అనువిషయాన్ని యీనియమావళిలో స్పష్టపరచినారు. "గైర్ ఖాల్సా" అనగా ఖాల్సావారుకాని ౧౮ ఏండ్లకు పైబడినవారందరును ౪అణాల సంవత్సరచందాయిచ్చి సభ్యులుగా చేరవచ్చును. అని నిర్ణయించినారు. "ఖాల్సా కానిభాగము"అని నిర్ణయించుట సమంజసముగానున్నది. అట్లనుటచేచిన్న పెద్దజాగీరులు, సంస్థానాలు,పాయిగాలు, సర్ఫెఖాసు అను తరగతులన్నియు చేరును.

ఉద్దేశము సాధారణమైనది. చందా నామకార్థమైనట్టిది. ఈకారణాలచే ఈ సంఘములో వేలకొలదిసభ్యులు చేరుటకు మంచి సౌలభ్యమున్నది.

ఈజాగీరు ప్రజాసంఘమువారు ఒక్కవిషయములో వెంటనే శ్రద్ధతీసుకొనవలెను. మనరాష్ట్రి మాల్గుజారీ శాసనములు, హుకుములు, గస్తీలు, మురాసిలాలు, తీర్పులు ఇవన్నియు ఒక ఒంటెమోతంతవి కావు. అందులో విశేషముగా పరస్పరవిరుద్ధమైనవికలవు ఎన్నియోగస్తీలురద్దయినవి ఎన్నియోతీర్పులు మారిపోయినవి. ఎన్నియో కొత్త శాసనములు వచ్చినవి. మురాసిలాలకు కూడ శాసన సమానత్వముకలదు. ఇవన్నియుచూడగా హిందువుల ధర్మశాస్త్రాలవలె "మునయోవిభిన్నాః ఋషయోవిభిన్నాః" అన్నట్లు పరస్పర భిన్నముగా నున్నవి. అందులో జాగీర్దారుల అధికారాలేవో, వాటికి పరిమితియేదో, జాగీర్దారుల విధులేవో, రైతుల అధికారాలేవో, [illegible] స్పష్టపరచునట్లుగా ఒక గ్రంథమును గస్తీలను శాసనాలను, తీర్పులను ఉదహరించుచు వ్రాసి ముద్రించవలెను. అగ్రంథము జాగీరు రైతులలో గొప్పప్రబోధము కలిగించగలదు. అంధకారములో అదొక విద్యుద్దీపముగా నుండగలదు.

మరొక్కసూచనను ఈ నూతనసంఘానికి చేయదలచినాము. మనరాష్ట్రములో నెలకొకటిచొప్పున సంఘాలో, సంస్థలో, ఏదైనాఒకటి యుత్పత్తియగుచుండును. అందుకొన్ని మఖలోపుట్టి పుబ్బలో ఎగిరిపోవును. కొన్ని కుంభకర్ణునిఛాయలో సంవత్సరమువరకు నిద్రిపోయి వార్షికోత్సవానికి మాత్రము లేచికూర్చునును. కొన్ని సరిపడనివారి బెదరింపులకే దివాలా తీసిపోవుచుండును. కొన్ని సరియైన అతిరథులు మహారథులు దొరకకముందు నడువకుండా యథాస్థానములోనే నిలిచియుండును. ఈ జాగీర్దారు సంఘమువారు తదితరులలోని యీలోపాలను గమనించి ఏకదీక్షతో పనిచేయవలసియుండును. ఏసంస్థకైనను సరియైన నాయకుడు మొదలు దొరకవలెను. అతనికి తక్కినవారు శక్తివంచనలేకుండ సహాయపడవలెను.

---

## ఇండియాప్రభుత్వపు యుద్ధకమిటీలు

జిన్నా గారివద్దికి పంజాబుముస్లింలీగువారి రాయబారము

బొంబాయి, అగస్టు౧౦

పంజాబు ముస్లింలీగువారినిర్ణయము ననుసరించి పంజాబు ముస్లింలీగుసభ్యులుకొందరు అ. భా. ముస్లింలీగు అధ్యక్షుడగుమహమ్మదాలీజిన్నాగారి వద్దకుపోయి లీగుసభ్యులు యుద్ధకమిటీలలో చేరరావని గావింపబడియుండిన ఉత్తరువును ఉపసంహరించి, యుద్ధమునకు తాము పూర్తిగా తోడ్పడనిశ్చయించిరి. పంజాబులో మహమ్మదీయుల ప్రత్యేకస్థితిని వారు తెలియజేసి, పంజాబులీగు కార్యకర్తతీర్మానమును వర్తింపకుండ చేయవలెనని కోరినట్లు తెలియుచున్నది.

పంజాబును మినహాయించుటకు కారణమేమియు నగపడదని రాయబారవర్గమును చూచి మాట్లాడినతరువాత జిన్నాగారొక ప్రకటనగావించిరి.

రాయబారవర్గ నాయకుడగు మాలిక్ బర్కతు నవాబుసాహెబుగారు పత్రికలతో మాట్లాడుచు జిన్నాగారు, యిచ్చినసలహాను విచారించుటకు తాను పంజాబులీగుసభను లాహోరులో ౧౭తారీఖున సమావేశపరచుననిచెప్పెను.

౨౦ మందిపై డిసిప్లినరీచర్య

లీగు అధ్యక్షుని ఉత్తరువులను, రాష్ట్రీయముస్లింలీగు తీర్మానము నుల్లంఘించి యుద్ధకమిటీలలో నుండుట కంగీకరించినందులకు ౨౦ మంది ముస్లింలీగుసభ్యులపై శిక్షాచర్య గైకొనబడెను. ౨౧రం సం॥అగస్టునుండి రెండేండ్లవరకు వీరు లీగులో చందాదారులుగాచేర వీలులేదు.

అసాముశాసనసభయందలి లీగుసభ్యులుతమ జీతములో నెలకు౧౦౦కి ౫వంతులు లీగునిధికి చెల్లింపవలెనని అస్సాంరాష్ట్రము ముస్లింలీగు కార్యదర్శిసభవారుకోరిరి.

---

## డీగాల్ సేనాని సత్యాగ్రహ ప్రబోధము

గాంధిమహాత్ముని ప్రశంస

డీగాల్ సేనాని ఫ్రెంచిపురుషులను స్త్రీలను సాత్విక నిరోధము అవలంబింపవలెనని కోరినను అంశము గాంధిమహాత్ముడు సాదృశ్యమునకై చూపుచు నేటి "హరిజన్"లో ఒక వ్యాఖ్య వ్రాసినాడు. ప్రపంచమంతయు తప్పనిసరిగా, తనుతానుగు తెలియకుండానే దౌర్జన్యరాహిత్యమార్గమునే అనుసరించుచున్నదని వారు సాదృశ్యముచే చూపించిరి.

"ఇంతటితో ఆయన భావములన్నియు మారినవని కాను చేతనైనచో శత్రువును నాశనము చేయవలెననియే ఆయన కోరును ఈ సాత్వికనిరోధము దౌర్జన్యరాహిత్య యుక్తమని చెప్పుటకు రేమాత్రము అవకాశము లేదు డీగాల్ సేనాని తనదేశస్థులకు యిచ్చినసలహా నందుకుసాదృశ్యముగా చూపుచుంటిననగా, ప్రపంచమంతయు తప్పనిసరిగా తెలియకుండ దౌర్జన్యరాహిత్యమార్గమునే అనుసరించుచున్నదని చూపుటకే.

---

## హిందూ మహాసభ కార్యవర్గ సమావేశము

వైస్రాయిగారి ప్రకటనపై చర్చ

నాగపూరు, అగస్టు ౧౨

అఖిలభారత హిందూమహా కార్యనిర్వాహకవర్గము నేటిఉదయము డా॥ బి. ఎస్. మూంజీగారియధ్యక్షతను యిచ్చట సమావేశమయ్యెను సుస్తీగానుండుటచే సభాధ్యక్షుడు శ్రీ వినాయక దామోదర సావర్కరుగారు బొంబాయి నుండి సభకు రాజాలకపోయిరి. సభ్యులుగాక కొందరు మహాశయులు ప్రత్యేకాహ్వానముపై సభకు వచ్చియుండిరి. ఆంధ్రహిందూసభపక్షమున శ్రీకుమ్మిడిదల వెంకటసుబ్బారావు గారుగూడ సభలో పాల్గొనిరి. మైసూరు మహారాజాగారి నిర్యాణమునకును, రాష్ట్రీయస్వయంసేవకసంఘ వ్యవస్థాపకప్రచారకుడగు డా॥ కే.బి హెడ్గేవారుగారి మరణమునకును హిందూమహాసభ, కార్యదర్శి శ్రీ జె పి వర్మగారి మరణమునకును సభవారు సంతాపమును దెలిపిరి.

వైస్రాయి ప్రకటనముపై చర్చ

వైస్రాయి ప్రకటనమును సభవారుచర్చించిరి. రోజంతయు చర్చజరిగినను సభవారు నిర్ణయము గావింపలేదు. వినరు వైస్రాయి ప్రకటనము హిందూసభవారి కోర్కెలను చాల కొరవడియున్నదని సభలో నన్నిపక్షలవారును అంగీకరించినట్లు తెలియుచున్నది.

బెంగాలునుగూర్చిన తీర్మానము

ఇప్పటి బెంగాలు మంత్రివర్గమువారు హిందువులకు ప్రతికూలమగుపద్ధతులను అవలంబించుచుండుటవలన బెంగాలులో నేర్పడిన విషమస్థితికి అమర్దా వెలిబుచ్చుచు సభవారొక తీర్మానము నామోదించిరి. హిందువులకు ప్రతికూలముగా నవలంబింపబడిన చర్యల నన్నిటిని ఉపసంహరించుకొనవలెనని సభవారుకోరిరి. తమహక్కులను. క్షేమమును రక్షించుకొనుటకు బెంగాలు హిందువులు గావించుచున్న ప్రయత్నములకు సభవారు సానుభూతిజూపుచు అవసరమైనచో బెంగాలు పోరాటమును అఖిలభారత పోరాటముగాజేయుటకు వాగ్దానముచేసిరి. బెంగాలు శాసనసభలో హిందువులకు ప్రతికూలమగుశాసనము ను ప్రవేశపెట్టకుండ వైస్రాయి గారును, బెంగాలుగవర్నరుగారును చర్యగైకొనవలెనని సభవారు కోరిరి

నాగపూరు, అగస్టు ౧౧

నేడు హిందూమహాసభ కార్యవర్గమువారు మూంజీ, శ్యాంప్రసాదుముఖర్జీ, వరదరాజులునాయుడుగార్లనుకలసి ఒక కమిటీగాఏర్పాటుచేసి ఆకమిటీకార్యవర్గసభ్యుల అభిప్రాయాలను సావర్కరుగారికి తెలియబరచవలెనననిరి. సావర్కరుగారు వైస్రాయిగారితో సంభాషించిన తర్వాత కార్యవర్గమువారిఅభిప్రాయమునకుయుక్తగినచర్యగైకొనవచ్చునని తీర్మానించబడెను. వైస్రాయిగారి ప్రకటనఅసంతృప్తికరము గాను, చాలనిదిగాను ఉన్నట్లు కార్యవర్గమువారుతలచిరి. కొన్ని అంశములను స్పష్టముచేసినచో వైస్రాయిసూచనకంగీకరింపవలెనని కార్యవర్గమువారుతలచుచున్నట్లుకనపడుచున్నది. యుద్ధానంతరముఒకఏడాదిలోగా డొమినియన్ స్టేటసు యిచ్చునట్లును. అల్పసంఖ్యాకుల హక్కుల రక్షణకేర్పాటుచేయునపుడు అధికసంఖ్యాకుల హక్కులు మరువబడకుండవలెనను అభయమును వైస్రాయిగారిచ్చినచో సావర్కరుగారు వైస్రాయి గారి కార్యవర్గములో చేర్పుకొనుటకు తగినహిందూమహాసభ సభ్యుల పేర్లనుకొన్నిటిని సూచించెదరనుకొనుచున్నారు

మహాసభ కార్యవర్గమువారు చేసినఇంకొక తీర్మానంలో ప్రభుత్వేతరసంస్థలకు మిలిటరీడ్రిల్లును మిలిటరీయూనిఫారములను నిషేధించు ఆజ్ఞను రద్దుచేయవలెనని కోరబడినది

---

## వైస్రాయిగారిని చూడవలసినపనిలేదు

కాంగ్రెసు అధ్యక్షునివైఖరి

కాంగ్రెసుఅధ్యక్షులగు మౌలానా అబుల్ కలాంఆజాదుగారు "అసోసియేటెడ్ ప్రెస్" ప్రతినిధితో అగస్టు ౧౧వతేది కలకత్తాలో మాట్లాడుచు వైస్రాయిగారి అగస్టు ౮వతేదినాటి ప్రకటనను కాంగ్రెసు త్రోసిపుచ్చినందున సంబంధమేమీ లేదనేకాబట్టి ఈవైస్రాయి గారితో సంభాషించవలసినపనిలేదనిరి కానిఅగస్టు ౧౭వతేది కాంగ్రెసుకార్యవర్గమును సమావేశపరచుచున్నాననియు, వారాలోచించి అగస్టు ౨౧వతేదిలోగా వైస్రాయిగారికి పంపవలసిన జవాబును నిర్ణయించగలరనియు చెప్పిరి.

---

## నెహ్రూగారి అభిప్రాయము

పండితజవహర్లాలునెహ్రూగారు అగస్టు ౧౧వతేదికాన్పూరులో పత్రికాప్రతినిధులకు వైస్రాయిగారి ప్రకటనపై తమఅభిప్రాయముచెప్పిరి. కాంగ్రెసుకును ఆప్రకటనకునుమధ్య ఎంతో గొప్పఎడమున్నదనివారనిర్హ డొమినియన్ స్టేటసు చచ్చినదనిరి.

---

## భారతీయులకు అమెరీగారి విజ్ఞప్తి

ఇంగ్లాండులో బ్లాక్పూలులో ఒకసభయందు ఇండియా సెక్రటరీఆఫ్ స్టేట్ అగు యల్. యస్. అమెరీగారు ఉపన్యసించుచు భారతీయులు వైస్రాయిగారుకోరినట్లువారి క్రొత్తకార్యవర్గములో చేరవలసినదని విన్నవించిరి.

భారతదేశమునకు బ్రిటిషు సామ్రాజ్యములో ఇతరడొమినియనులతో, అనగా బ్రిటనుతోసమానమైన భాగస్వామిత్వము ఇవ్వబడుననివలుమారు చెప్పుచుంటిగదాయనిరి. ఈమాఆశయము నిజమేయనిచూపుటకు నిదర్శనముగా పోయినకొద్ది రోజులలో మేము మరియొకమాటకూడ చెప్పినామనిరి. అదియేమనగా, భారతదేశముతో చిరకాలసంబంధముచే తమకు సంక్రమించిన ప్రత్యేకబాధ్యతలకు విరోధంలేకుండా భారతదేశీయులుతమ ఆశయాలకు తగినరాజ్యాంగమును నిర్ణయించుకొనవలెననియేమాకోరికయని అమెరీగారుచెప్పిరి.

ఈఆశయమంతయు యుద్ధానంతరముగాని సంపూర్తికాదు, కానిదానిపనిపూర్తినిగురించిన ఆలోచనలు, సంప్రతింపులు మున్నగు ప్రాథమిక కార్యములను ఈలోగానే ప్రారంభించి సాగించుచుండవచ్చునని వారుచెప్పిరి.

---

## విద్యార్థులకు సైనిక శిక్షణము

కలకత్తా, అగస్టు ౯

భారతవిద్యార్థులను సైనిక, నావాదళ, విమాన దళాధికారులుగా తయారుచేయునిమిత్తమై విశ్వవిద్యాలయ కేంద్రములలో సైనిక కళాశాలను నేర్పరుపవలెననియు, ఆత్మరక్షణమునకుగాను సైన్యము లేకుండ బ్రిటిషుఇండియాప్రజలు ఆయుధముల నుంచుకొను నవకాశముపొంగవలెననియు, నేడుబెంగాలుకౌన్సిలులో రెండు ప్రతిపాదనములు గావింపబడెను.

మొదటిప్రతిపాదనమును కాంగ్రెసుపార్టీసభ్యుడగు శ్రీ లలితచంద్రదాసుగారు గావించిరి. యుద్ధము భారతదేశమునకు దగ్గరకు వచ్చుచుండుటచేత బ్రిటిషుప్రభుత్వమువారును, ఇండియాప్రభుత్వమువారును భారతీయులకెదురుకానున్న ఆపదను దృష్టియందుంచుకొని యువకులకు ఆత్మరక్షణోపాయములను నేర్పవలెనని వారుకోరిరి.

ప్రభుత్వ ప్రత్యుత్తరము

ఈవిషయము ఇండియాప్రభుత్వమునకు సంబంధించినది. తాము సభలోజరిపిన చర్చను ఇండియాప్రభుత్వమునకు పంపుదుము. ప్రతిపాదనములోని సూచన అనాచరణీయమని తనస్వకీయాభిప్రాయము అని ప్రభుత్వపక్షమున సర్, బిజయప్రసాదుగారుచెప్పిరి.

హుమయూన్ కబీరుగారు రెండవప్రతిపాదనమును గావించుచు ఆంగ్లదేశములోప్రతివారు ఆయుధములు కలిగియుండవచ్చుననియు, భారతదేశములోగూడనట్లేయుండవలెననియుచెప్పిరి.

ఈవిషయమును ఇండియాప్రభుత్వమునకు సంబంధించినదనియు వోటింగులో ప్రభుత్వమువారు తటస్థముగానుందురనియు, చర్చనుఇండియాప్రభుత్వమునకు పంపుదురనియు హోంమెంబరు ప్రత్యుత్తరమొసగెను.

మొదటిప్రతిపాదనము ౭౩—౧౫ వోట్లవారతోను, రెండవప్రతిపాదనము ౧౫—౧౭౫ వోట్లతోను నిరాకరింపబడెను. ప్రభుత్వమువారు తటస్థముగానుండిరి.

---

## ఇంగ్లాండులో ౩ లక్షల ఇంజనీర్లు

లండను, అగస్టు౯

ఇంతవరకును ప్రభుత్వమువారి యుద్ధావసర కార్యాలకై పనిచేయకుండానున్నటువంటి ఇంజనీర్లు చాలామంది యింగ్లాండులోకలరు.అట్టివారి పేర్లు నమోదుచేయబడెను. ౩లక్షలమంది. ప్రవీణులును, పనివాండ్లుకూడా యుద్ధకర్మాగారములలోపనిచేయుటకై నిర్బంధముగా ఆహ్వానింపబడగలరని తెలియుచున్నది.

## ఐ. సి. ఎస్. ఆఫీసర్ల జీతాలలో కోత

సిమ్లా, ఆగస్టు ౯

ఇండియన్ సివిల్ సర్వీసు ఉద్యోగస్థులు యుద్ధనిధికి సహాయార్థము తమజీతాలలో కొంత భాగమునిచ్ఛికంగా ఇచ్చివేయుటకు ఆలోచించుచున్నట్లు తెలిసినది.

ఇప్పుడుసిమ్లాలోవున్న పంజాబు ఐ.సి.ఎస్. ఆఫీసర్లు నిన్నటిరోజున సభజరిపి యీవిషయము గురించి చర్చించిరి.

## ఇపీఫకీరునుండి దినాఫకీరు విడిపోవుట

రావల్పిండి, ఆగస్టు ౯

ఒకానొకప్పుడు ఇపీఫకీరుకు కుడిభుజముగా పనిచేసిన దినాఫకీరు విడిపోయి వజీర్‌స్థాన్‌లో సంచరించుచున్నాడనీ, కొండజాతులవారిని సమావేశపరచి ఉపన్యాసములిచ్చుచున్నాడనీ తెలియుచున్నది. మనుష్యులను ఎత్తుకొనిపోవుట దోపిడీచేయుటతగదని అతడు అతితీవ్రముగా ఖండించుచున్నాడు

## చక్కెరధరను ప్రభుత్వమే నిర్ణయించును

చక్కెరధర నిర్ణయించుటకు అధికారమిచ్చిన చక్కెరసిండికేటుయొక్క అధికారమును ఇటీవల బీహారు సంయుక్తరాష్ట్ర ప్రభుత్వములు గుర్తించుట మానుకొనెను. చక్కెరఫ్యాక్టరీలు అవసరములో సభ్యతకలిగియుండవలెనను నియమము తొలగింపబడెను. చక్కెరధర-ఎంత అని నిర్ణయించవలెనను సమస్యపై ఈ ప్రభుత్వములకును సిండికేటుకును భేదాభిప్రాయములు ఏర్పడుటే ఈచర్యకుకారణము.

మరల పరస్పరము సంప్రతింపులు జరిగి ఈ భేదాభిప్రాయములు పరిష్కారమైనవి. తిరిగి సిండికేటును గుర్తించుటకు ప్రభుత్వములంగీకరించెను. ఈసేప చెరకుపంటనుండి తయారుకాగల చక్కెరకు ఎంతధరయుండునో ఊహించి ఆ ధరకనుగుణముగా ప్రస్తుతపు చక్కెరధర నిర్ణయించుచో నిలవగా ఉన్నచక్కెరకు అమ్మకము కలుగుననియు, అందువల్ల చెరుకుపంటదారునికి ప్రోత్సాహమేర్పడుననియు నిర్ధరింపబడెను. ౧౯౪౦-౪౧ లో చక్కెరకు ఎంతఅమ్మకముండునో ఊహాయింపుసుబట్టి చెఱుకుపండించు ఎకరములను శాసనపూర్వకముగా తగ్గించవలెననియు, ఈఏడు మిగిలిపోవు చక్కెరను పైఏటిచక్కెరలో చేర్చవలెననియు అంగీకారము కుదిరెను.

ఈ ఒడంబడిక అమలులోనికి వచ్చుటకు ఒక చక్కెరవిక్రయసంస్థ అవసరము. చక్కెర సిండికేటు అట్టిసంస్థగా పనిచేయుచుండును ప్రభుత్వమువారు నిర్ణయించినధరలప్రకారం పరిమితులప్రకారం చక్కెరఅమ్మకమగుచుండునట్లు చేయుటతప్ప ఇతరకార్యములతో ఈసిండికేటుకు ఇకమీద ప్రమేయముండదు.

సిండికేటుయొక్క కార్యనిర్వాహకాధికారిని ప్రభుత్వంవారే నియమింతురు.

బీహారు సంయుక్తరాష్ట్ర ప్రభుత్వములుకలిసి చక్కెరకమిషను అనుపేరోక సంస్థ ఏర్పాటు చేయును. చక్కెరఉత్పత్తి, అమ్మకము, చెఱుకుధరలు, కోటాపరిమితులు వీటివిషయమున ప్రభుత్వాధికారమును ఈ సంస్థ చలాయించుచుండును.

## హైదరాబాదుపై నిజాంప్రభువుపాలన

పూర్ణస్వరాజ్యానికి మతవిభేదము ఆటంకముకాదనుటకు నిదర్శనము

మదరాసులో రాజగోపాలాచారిగారి ఉపన్యాసము

"గాంధిమహాత్ముడు కాంగ్రెసునువిడువడు,విడిచినను నేను, పటేలుమున్నగువారు విడువనివ్వము. ఢిల్లీతీర్మానముప్రకారము స్వపరిపాలన వచ్చితీరును, అవిషయమై మీరేమియు సందేహపడనక్కరలేదు."

అని శ్రీమాన్ సి. రాజగోపాలాచారిగారు ఆగస్టు ౫ వతేది సాయంకాలము మద్రాసు కాంగ్రెసు మందిరావరణయందు వేనకువేలజనుల సమక్షమునందుపన్యసించుచు దెలిపిరి. సత్యమూర్తిగారు సభాధ్యక్షతవహించిరి.

అధ్యక్షులు ప్రథమమున మైసూరుమహారాజాగారు చనిపోయినందుకు సంతాపము దెల్పుచు తీర్మానము ప్రతిపాదింపగా సభ్యులందరును లేచినిలిచి ఆమోదించిరి.

సి. రా. గోపాలాచారిగారు

రాజగోపాలాచారిగారింకను ఇట్లుచెప్పిరి: "మాదేశాన్ని మేము పరిపాలించుకోవాలని తీర్మానించినాము. మాఆయుధము నాయకులకు నచ్చలేదు. అయితేనేమి? అతనితో ఒకవిధముగా సర్దుకొందుము. కాని ఇంగ్లాండు ఇండియాకు స్వరాజ్యము ఇచ్చితీరవలెను. ఇవ్వనని వైస్రాయి గాని, చర్చిల్ గాని బహిరంగముగానో రహస్యముగానో అననీ చూతము, ఇచ్చితీరవలెనని నేనుగట్టిగాచెప్పుదును. వైస్రాయి గారు యిక్కడికివచ్చి కొందరితో రహస్యముగామాట్లాడి కాంగ్రెసు సంపూర్ణస్వాతంత్ర్యము కోరుచున్నది. కనుక తానేమీచేయలేనని చెప్పియుండవచ్చును. అందుచే కాంగ్రెసు చేసినది తప్పని వదంతి వ్యాపింపవచ్చును. అట్టిమాటలునమ్మరాదు కాంగ్రెసుకార్యవర్గము తీర్మానించినప్రకారము పాటుపడిన, నేను స్వరాజ్యము సంపాదించిపెట్టెదను. మీరునమ్మండి. ఎట్టిసందేహమువలదు.

గాంధియే మననాయకుడు

గాంధిగారు నేటిహరిజనపత్రికలో తాను నాయకత్వం వదలలేనట్లు వ్రాసియున్నారు. కావున ఆవిషయం సందేహపడ నవసరంలేదు. గాంధి దూరపుసంబంధియైనను తనను మరచిపోయినను స్వరాష్ట్రీయుడగువల్లభాయిని మరవజాలడు. నెహ్రూను అంతకన్న మరువజాలడు. పత్రికలలో ప్రచురింపబడినట్లు తీవ్రభేదాభిప్రాయములు, విడబడుటలు నిజమయినచో, గాంధి యీపాటికి మంచంపట్టియుండవలసినది. అతను చాల సంతృప్తిచెంది ఆనందంగానున్నాడు.

పూర్ణస్వరాజ్యానికి మహమ్మదీయులు, సంస్థానాలు ప్రతికూలమని సాకుచెప్పుచుందురు. ఆదినిజంగాదని మనకు తెలియును. దూరానఉన్న ఆంగ్లేయులకు కనబడావారికి ఎట్లుతెలియును? ఎన్నివ్యత్యాసాలున్నా రాష్ట్రాలలో స్వపరిపాలన సాగలేదా! కేంద్రంలో సాగదని ఎందుకు అనుమానం? నూటికి ౯౦ మంది హిందువులుగల హైదరాబాదునునైజాంపాలించలేదా?మహమ్మదీయులు ఎక్కువగానున్న కాశ్మీరును హిందూ రాజు, బ్రాహ్మణదివానుతో పాలించలేదా? అచ్చటిప్రజలకు రాజభక్తి తగ్గిపోయినదా? కావున భారతీయులు జాతీయప్రభుత్వముయెడల భక్తికలిగియేయుందురు. సందేహములేదు. బ్రిటిషువారు స్వాతంత్ర్యం యిచ్చియేతీరవలెను"

## ఆదివారోపన్యాస మండలి అహమ్మద్‌నగర్

హకీం జనార్దనస్వామి గారి అధ్యక్షతన ద్వితీయ వార్షికోత్సవము

(స్వ.వి.) హైదరాబాదు, దక్కన్),

మెహరు ౩

అహమ్మదునగరమందు ఈఆగస్టునెల ౧౭వ, ౧౮వతేదులు శని,ఆదివారములలో "ఆదివారోపన్యాసమండలి ద్వితీయవార్షికోత్సవము అఖిల భారత పద్మశాలి సప్తమమహాసభాధ్యక్షులును దక్కన్‌పద్మశాలి సంఘోద్ధారకులునునగు శ్రీమాన్ వైద్యభూషణ హకీం దావతుజనార్దన స్వామి గారిఅధ్యక్షతన జరుగగలదు. శనివారము ఉదయం౯గంటలకు అధ్యక్షులకు స్వాగతము, సాయంత్రము ౩గంటలకు వక్తృత్వ పోటీపరీక్ష. ఆదివారముసాయంత్రం ౫గంటలకు స్వాగతోపన్యాసము, సందేశములు, అధ్యక్షోపన్యాసము— ఇవి కార్యక్రమములోని అంశములు. అందరును సభకురావలసినదని స్వాగతసంఘాధ్యక్షులును కార్యదర్శులును విన్నవించుచున్నారు.

శ్రీమాన్ జనార్దనస్వామి గురువారం(ఆగస్టు ౧౫వతేది) హైదరాబాదునుండి బయలుదేరిపోయి షోలాపూరులో అఖిలభారత పద్మశాలి అష్టమ మహాసభసమావేశమునకు అహ్వానసంఘము ఏర్పాటునుగూర్చిన ఆలోచనలలో పాల్గొని, తర్వాత అహమ్మదునగరుకు పోగలరు.

# భారతదేశానికి మిలిటరీ స్వపరిపాలన

## వైస్రాయిగారికి నేషనలు లిబరలు ఫెడరేషను విజ్ఞప్తి

పూనా, అగస్టు ౯

నేటిసాయంకాలము భారతజాతీయ లిబరలు ఫెడరేషనువారి ప్రతినిధులు నల్గురు వైస్రాయివద్దకు వెళ్ళి ఇండియాకు మిలిటరీ స్వపరిపాలన యివ్వవలసినదని కోరుచు ఒక మెమోరాండము సమర్పించుకొనిరి.

రాయబారుల అధ్యక్షుడు వీరు వైస్రాయితో ఒక గంటసేపు సంభాషించిరి.

మెమొరాండము

మెమొరాండములో ఈక్రిందివి ముఖ్యవిషయములు.—

సేనలు

ఇప్పటినుండి దేశములో యువకులకు దేశసేవనుగురించి ఉత్సాహముకలిగించిన, అవసర సమయములో వారు శక్తినంచవలేకుండ స్వయముగ దేశమును సంరక్షించుకొనుటకు అవసరమైన త్యాగములు చేయగలుగుదురు.

కనుకయీ పరిస్థితులలో దేశరక్షణశాఖకు ఒక భారతీయమంత్రిని నియమించవలెను.

మేనెల ౩౧వ తేదిని ప్రధానసేనాధిపతి గారిచ్చిన బ్రాడ్కాస్టు ప్రసంగము ప్రజలకుచాల అసంతృప్తికలిగించినది. దేశసంరక్షణ విషయములో ప్రభుత్వము ఎక్కువగా భారతీయులకు తరిఫీదు యిచ్చుటకు సమ్మతించుటంలేదనే అక్రమం గమువలన స్పష్టమగుచున్నది.

యుద్ధసేనలుమాత్రమే దేశరక్షణకుచాలవు. వీటివెనుక సహాయార్థము సైన్యాలు ఏర్పడవలెననే సంగతి అందరును గుర్తించినదే. అందుకే శాంతిసమయములో సామాన్యప్రజలకు సైనిక శిక్షణనిచ్చివారిని ప్రాంతీయసైన్యముగా ఏర్పరచి ఉంచుదురు. కాని భారతదేశములో కొన్నిరాజకీయ కారణాలవలన సామాన్యప్రజలకు సైనిక శిక్షణనిచ్చుటలేదు, ప్రభుత్వమువారు యుద్ధజాతులకు చెందినకులాలలోనుండు ప్రజలను సైన్యములో చేర్చుకొనుచున్నారు. దీనినిబట్టిప్రభుత్వముజాతీయసేనానిర్మాణావశ్యకతను గుర్తించినట్లుతోచుటలేదు. ఇప్పుడు ప్రభుత్వమువారుసైనికజాతులు, ఇతరజాతులుఅనే భేదకల్పనమానివేసి, సామాన్యప్రజలకందరికిని ప్రాంతీయసైనికదళములకు చేర్చిసైనికవిద్యకన్న మేలురకమైన విద్యనిచ్చిదేశమంతటను ప్రజలకు సేనలలో పని చేయుటకు ఉత్సాహముకలిగించవలెను.

ఈశ్లిష్టసమయములోకూడా సైన్యములోనికి ఉద్యోగులను చేర్చుకొనుటలో ప్రభుత్వమువారు యూరోపియనులపట్లనే పక్షపాతము కనపరచుచున్నారు కాని భారతీయోద్యోగులను విశ్వసించుటలేదు.

ఇప్పుడుసైన్యములో ౧౫౦,౦౦౦ మంది ఉన్నారు. వీరికి ౩౦౦౦ ఉద్యోగులున్నారు. ఇంకను సైన్యమును ౭౫౦౦౦ హెచ్చు చేసినచో ౧౫౦౦ మంది ఉద్యోగులను నియమించవలసి ఉండును వీటిలోక్రిందిపుద్యోగములైన భారతీయులకు యివ్వవచ్చును, కానిచివరకు ప్రభుత్వము యీపనియైనను చేయునని ఆశకనిపించుటలేదు.

ఈసంవత్సరములో సాధ్యమైనంతమంది భారతీయోద్యోగులను తీసుకొందుమని ప్రభుత్వము ఇదివరవాగ్దానము ఆచరణలోకిరాదు. కనుక యిప్పుడు ప్రభుత్వమువారు యుద్ధములోకి యూరోపియనుల ఆంగ్లోఇండియనులు, భారతీయుల జాతులనుండి ఎంతమందిని సైనికోద్యోగులుగా చేర్చుకొన్నారో, ఇకముందు ఎంతమందిని ఆజాతులనుండి చేర్చుకొనబోతురో స్పష్టముగా తెలియపరచవలెను. ఇప్పుడుజాతీయ సైనికదళములు ఎర్పడవలెనని ప్రజలు అభిలాష పడుచున్నారు. ఇదివరలో ఎట్లుజరిగినప్పటికిని యికముందునుండి అయినను భారతీయుల యాజమాన్యముక్రిందనే భారతీయసైనికదళము నేర్పరుచుటకు ప్రభుత్వము పూనుకొనవలెను.

విద్యార్థులకు సైనికశిక్షణ నేర్పుచున్నారు కొనిఆర్టిదళములు ఏర్పరచిన ఉద్దేశముతో వేరలేదు ఇంగ్లాండులోపలనే యీదళములలోనుండి భారతీయ సైనికోద్యోగులను నియమించవచ్చును. విద్యాధికులైన ప్రజలకు ఉద్యోగములుయిచ్చినందువలన యువకులకు సైన్యములో చేరి దేశ సేవచేయవలెనను ఉత్సాహముకలిగించవచ్చును.

విమానదళాలు

దేశరక్షణకు విమానబలముచాలఅవసరమైనను భారతదేశములో ఒకవిమానదళము మాత్రమే ఉన్నది మరిమూడుదళములు తయారగుచున్నవట. ఈదళాలుగుదళములుకూడచాలపు బాగుగా శిక్షణపొందిన మెకానిక్కులు, అవసరమైన సామాగ్రిలభ్యముకాకపోయినందువల్లనే విమానబలమునుఅభివృద్ధిపరచవీలులేకపోవుచున్నది అధినివేశనములలోని ప్రజలనుచేర్చుకున్నట్లే భారతీయులనుకూడ బ్రిటిషువిమానబలములో చేర్చుకున్నచో అనేకమంది భారతీయులు విమానములు నడపగలవారు తయారగుదురు. విమానబలములో చేరుటకు భారతీయయువకులు అభిలాషకలిగియున్నారు. గానిఅందులోపనులు తెల్లవారికే ఇవ్వబడుచున్నవి.

నౌకాబలము

నౌకాబలము భారతదేశములో ఏర్పడినప్పుడుదానిలో ఖాళీలువచ్చినప్పుడు మూడవంతు ఉద్యోగములను భారతీయులకు యివ్వవలెను. ఒకనిబంధన ఏర్పడినది కానిఅధికారులు యీనిబంధననుఅనుసరించుచున్నట్లు కనిపించదు భారతవిమానబలములోవలెనే నౌకాబలములోకూడ భారతీయులకే యాజమాన్యము ఇవ్వవలెను

మందుపరిశ్రమ

సైన్యానికి అవసరమైన మందుగుండుసామగ్రి దేశంలోనే తయారగుటకు లేకపోటికిలేగిన ప్రయత్నములు ప్రారంభమైనవి కాని విమానాలు, టాంకులు, యుద్ధపుమోటార్లు ఇక్కడతయారగుటలేదు. ఆధునికయుద్ధమువీటితోనే ఉండును.

—

# భారతదేశములో శత్రువుల సంస్థలు

సిమ్లా, అగస్టు ౯

ఈక్రిందికంపెనీలు శత్రుసంస్థలని బ్రిటిషుప్రభుత్వమువారు ప్రకటించిరి వీటిపైయాజమాన్యమును బ్రిటిషుఇండియాలోని శత్రువుల ఆస్తుల అధికారిస్వాధీనములో ఉండునని ప్రకటించినారు.

౧ రోటాస్ ఇండస్ట్రీస్ బేక్లైట్ ఫ్యాక్టరి, బొంబాయి ౨. కె. లడ్విగ్ అండ్ కంపెనీ బొంబాయి, ౩ లోపెజ్ ఫెర్నాండో హెయిర్ డ్రెస్సర్: సైనీటాలూం లక్నో. ౪. జర్మన్ క్లబ్ అండు అథెలెటిక్ ఎసోసియేషన్, కలకత్తా. ౫ ఇటాలియన్ ప్రొవిజన్ కంపెనీ, బొంబాయి,

—

# ఖాక్సారుసాయకులకు హెచ్చరిక

పెషావరు అగస్టు, ౧౦

ఆయుధాలను ధరించిగాని ధరించకుండాగాని అనధికారి స్వచ్ఛందసేవకులు డ్రిల్లుమొదలైనవి చేయకూడదని ఇండియా ప్రభుత్వము నిషేధించినదికదా దానిని అనుసరించి పెషావరు డిప్యూటీకమీషనరు ఈరాష్ట్రములోని ఇద్దరు ఖాక్సారునాయకులనుకలసికొని కేంద్రప్రభుత్వాజ్ఞలను తెలియచేసిరి.

ఖాక్సారు కేంద్ర కార్యాలయమువారి అభిప్రాయములను తెలిసుకొనువరకు రూచర్యలు తీసుకొనరట.

—

# సంయుక్త నియోజకవర్గ పద్ధతి

## సరిహద్దు ప్రభుత్వవిచారణ

పెషావరు, అగస్టు ౧౦

సంయుక్త నియోజకవర్గములు, అల్పసంఖ్యాకులకు ప్రత్యేకస్థానములవిషయమై కొంతకాలము నుంచిసరిహద్దుప్రభుత్వము వివిధవర్గముల అభిప్రాయములు సేకరించుచున్నది.

ఇంతవరకు అధికారప్రకటన యేదియుజరుగకపోయినను చాలమందినాయకులు యీస్కీమునకు సమ్మతితెలిపిరని అనుచున్నారు.

—

జ్వరమువచ్చినపుడు, తేర్గడజెందు కాలమందు తీసుకొనదగు

## ఆహారము.

రోగపరీక్షయందు గమనించిన ముఖ్యవిషయములు:—

జ్వరము చేబాధపడువారిని పరీక్షింపగా కొన్నిముఖ్యవిషయములు కనిపెట్టబడినవి, శరీరఉష్ణత హెచ్చుట, భరించరంతటితలనొప్పి, ఎక్కువ వేడిమి, వెంట సేవణపటంతటిచలి ఇవన్ని యేకొలగుటకు కారణము జ్వరపు విషము నరములలో, స్నాయువులలో ప్రవహించుటచేత, ఈవిషముసకలావయవములను నీరసముగాజేసి రోగినిశక్తిహీనునిగాజేయును

రోగియొక్క కడుపునిర్బల మైనందున ఘనఆహారముసహించదు స్నాయువులకు ఏలాటిశక్తినిగలుగజేయవలయునో తెలిసికొనుటకష్టము ఆస్పత్రులలో రోగులకు హార్లిక్సునుఇచ్చిదానిఅద్భుతఫలితము చూపెట్టినారు. ఇదివందకువందపుష్టినిచ్చునదిగాన నిర్బలమైన జీర్ణకోశములో సులభముగాజీర్ణమగును. శక్తినితిరిగిచేకూర్చి నాయువులకు బలముకలుగజేయును. తేర్గడకాలమును తగ్గించును. ఇందువలనను సాధారణముగా అన్ని ఆస్పత్రులలోను దీనినేజ్వరబాధితులకు ఇచ్చుఏర్పాటుచేసినారు.

## కావలయును

నిజాంరాష్ట్రమునందు మాకంపెనీలో పనిచేయుటకై ఏజంట్లు మరియు ప్రతినిధులు కావలయును. ఉదారమైనపద్ధతులు. చేరినవారికి మొదలు ప్రత్యేకముగా పని నేర్పబడును. వివరములు యీక్రిందివారితో తెలుసుకొనుడు.

ఏ. కె. హారవు యూనిట్ ఆర్గనైజరు
స్టాలైఫ్ యిన్షూరెన్సుకంపెనీ (ఆఫ్ కనడా)
2095 సుబ్రిక్ స్ట్రీటు, సికింద్రాబాదు

Khan & Sons

—

# గోద్రెజ్ సబ్బులు

హిందూదేశమునందు యీమధ్యసబ్బుల పరిశ్రమయభివృద్ధిగాంచినది. ప్రఖ్యాతివహించిన సబ్బు పరిశ్రమికులలో బొంబాయి గోద్రెజ్ కంపెనీవారొకరు. వారిదివరకే అనేకరముల అత్యుత్తమసబ్బులను తయారుచేసి భారతీయుల మన్ననబడసినారు. ప్రస్తుతము "వతనీ" అనుఒక క్రొత్తసబ్బును తయారుచేసియున్నారు. వెలచాలస్వల్పమైనను యిందుమంచిగుణము గలదు. మంచిమురుగు, సువాసనగల్గి శరీరమునుండి అతిశీఘ్రముగా మురికిని తొలగించును. పరిమళముచాలసేపువరకుండును. యీరకము యితర సబ్బులన్నిటికంటె దీనిని మిన్నయని చెప్పదగును.

—

## ఇంగ్లాండులో యుద్ధ ఋణాల బాండులు

లండను, అగస్టు ౯

ఇంగ్లాండులోని ప్రజలు తమసంపాదనలో నిల్వచేసిన పైకములను నిల్వచేయుటకును అనిల్వ చేసిన మొత్తమును ప్రభుత్వంవారికి యుద్ధఋణము నకైయిచ్చి యుద్ధఋణపత్రములను తీసికొనుటకు ను ప్రజలను ప్రబోధించుటకై దేశమంతటను కమిటీలు ఏర్పాటుచేయబడెను. ఈకమిటీల కన్నిం టికిని ప్రెసిడెంటగు సర్ రాబర్టు కిండర్సలీగారు యిట్లుచెప్పిరి

ఒక్కొక్క యుద్ధసేవింగ్సుపత్రము ౧౫ షి ల్లింగులవిలువగలదైయున్నది. జూలై నెలాఖరుకు ౧౩౭౦లక్షలపౌనుల మొత్తంవరకు యీసేవింగ్సు సర్టిఫికేట్లలో వినియోగింపబడెను. ౧౫౦౦౦వేలకమి టీలువీర్పడి పనిచేయుచున్నవి, మొత్తం ౧కోటి మెంబర్లు యీయుద్యమంలో చేరియున్నారు. ౧౨౦లక్షల పోస్టాఫీసు సేవింగ్సుఖాతాలు కల వు. ౩౦లక్షలు ట్రస్టీసేవింగ్సు బ్యాంకు ఖాతాలు కలవు.

## సామ్రాజ్య యుద్ధసంఘము

ప్రభువులసభలో ప్రకటనము

లండన్ అగస్టు ౭

గత విరోపామహాసంగ్రామములో నవలం భించిన పద్ధతి ననుసరించి, యుద్ధములోనెక్కు వగా తోడ్పడుటకు అధినివేశములు, ఇండియా తోకూడిన ఒక సామ్రాజ్యయుద్ధసంఘము నే ర్పరుప ప్రభుత్వమువారు సంకల్పించినారని ప్ర భువులసభలో డేలీమ్ప్రభువు గారడుగగా అధి నివేశముల కార్యదర్శి కాల్డికోట్ప్రభువు యిట్లు చెప్పెను.

"సామ్రాజ్యదేశములలో యుద్ధమువిషయ మై సహకారభావము నేర్పరుచుటకుగాను సా ధ్యమైనంతవరకు అధినివేశముల ప్రతినిధులతో సం ప్రతించు టవసరమని ప్రభుత్వమువారు గ్రహిం చుచున్నారు. గతఅక్టోబరు మాసములో అధి నివేశ మంత్రులు లండనుకువచ్చియుండిరి, అ ప్పుడు యుద్ధములకు సంబంధించిన అనేకవిషయ ములనుగూర్చి చర్చలుజరిగెను. తరువాత అధిని వేశ మంత్రులుకొందరు ఈదేశమువచ్చిరి. సా మ్రాజ్యయుద్ధసభకుగాని. యితర చర్చలకుగాని యిప్పుడు అధినివేశముల ప్రతినిధులను ఈదేశము నకు ఆహ్వానించుట ఉచితముకాదని బ్రిటిషుప్ర భుత్వమువారు తలచుచున్నారు. అవకాశము క లుగుచో యిట్టిచర్యలు తప్పకజరుగును,

## సరిహద్దు దుండగములు

ద్రోహులు పట్టుకొనబడుట

పెషావరు జూలై ౨౦

సరిహద్దురాష్ట్రపు దక్షిణజిల్లాలలో ద్రోహు లను పట్టివేయుపని తీవ్రముగా కొనసాగుచున్న ది. తమదేశములో తలదాచుకొన్న నలుగురుద్రో హులను కొండజాతి ఖానాదారులు పట్టిరి. శా పలా ఖానాదారులు నలుగుర్ద్రోహులను పట్టు కొని బంధించిరి. గొండాల్లి వాస్తవ్యుడును, పో లీసువారికి దొరకకుండనున్నట్టి మీరు ఒమాను మందట్ పోలీసులకు లొంగిపోయెను పహార్ పూరు పోలీసు ఎనలుగురిని పట్టుకొనిరి. పారిపో యినయొకడు తనంతటతానే వచ్చి బహదూర్ ఖేల్ పోలీసులకు లొంగిపోయెను గురానీ, దా వూద్షా, అమండ్, నామాష్ఖేల ప్రాంతము లలో ద్రోహులు పట్టివేయబడిరి.

అహవద్జాయ్ మాలికుజాతివారు బ్రిటిషుదే శములో దుండగములు చేయుచో తీవ్రచర్యగైకొ నబడునని డిప్యుటీకమిషనరు గెప్పగా మలికులు ద్రోహులతోమాట్లాడి, ద్రోహులదుండగములు [illegible] తెలియజేసిరి

[illegible] ధహాణులగు మసూదులు డేరా యిస్మాయిలుఖాను జిల్లాయందలి లాలూగ్రా మమును ప్రవేశించి యిద్దరుపురుషులను, ముగ్గురు పిల్లలను, ఏడుపశువులను తీసుకొనిపోయిరి మను ష్యులు విడపింపబడిరి. ఈజిల్లాలోనే మరొకలు ద్రోహులు మరియొకరిని ఎత్తుకొనిపోయిరని తెలి యుచున్నది.

## యుద్ధపరిశ్రమలకు యంత్రనిపుణులు

3 వేల మందికి శిక్షణావకాశము

యుద్ధసామగ్రి తయారుచేయుచున్న పరిశ్రమ లలో యంత్రనిపుణులుగ పని చేయుటకు ఎంత మందికి ఇప్పుడున్న టెక్నికల్ పాఠశాలలు శిక్షణ ఇయ్యగలవనుఅను విషయము నిర్ధారించుటకు ఇం డియా ప్రభుత్వమువారు నియమించిన కమిటీనివే దికసమర్పించినది. వచ్చేతొమ్మిదినెలలలో, అద నముగా ౧౦వేలమంది యంత్రనిపుణులు కావలసి యుండును. ఇతరపరిశ్రమలలో అట్టిపనులు నిర్వ హించుచున్నవారిని, అట్టిపనులకు వలయుశిక్షణ పూర్తి చేసినవారిని చాలవరకు యుద్ధపరిశ్రమల లోనికి దీసికొందురు. అట్లుతీసికొనగా ఏటా 3 వేలమందిని క్రొత్తగాశిక్షణ ఇచ్చి తయారుచేయ వలసియుండును. ఇంతవరకు కమిటీపరిశీలనచేసిన టెక్నికల్ పాఠశాలలు ఏటాఇప్పుడు శిక్షణఇచ్చు చున్నవారికిగాక మరిమూడువేలమందికి శిక్షణ ఇచ్చుటకు చాలియుండునని నిర్ధారణచేసెను. అంచెలపద్ధతి అవలంబించుచో ఇంకను ఎక్కువ మందికి శిక్షణయొసగవచ్చునని కమిటీసలహా.

ఏఏపరిశ్రమలకు పనికివచ్చు యంత్రనిపుణులను ఏయేటెక్నికల్ పాఠశాలలు తయారుచేయగలుగు నోకూడ కమిటీవివరించినది, ఇందునిమిత్తము పరి శ్రమలను ౨౫వర్గములుగా విభజించినది టెక్ని కల్ పాఠశాలలో శిక్షణపొందువిద్యార్థులు యు ద్ధపరిశ్రమలలో చేరదలచునో ప్రత్యేకశిక్షణ పొందవలసియుండును.

చాలాగొప్పకార్యముల నిర్వహణముతో సం బంధపడిన, యంత్రనిపుణుల పదవులలో చేరదల చువారికి సమగ్రమగుశిక్షణను ప్రత్యేకముగా తగి నవేర్పాట్లుగావింపవలెనని కమిటీ అభిప్రాయము.

యుద్ధపరిశ్రమలుగాక, యుద్ధము మూలంగా అభివృద్ధిఅవకాశము తటస్థించిన సాధారణపరిశ్ర మలకు వలయు యంత్రనిపుణులను, కమిటీవ్యాధి చాలక పరిశీలనచెయ్యని టెక్నికల్ పాఠశాలలు తయారుచేసి సప్లయిచేయగలిగి యుండునని నివేది క సూచించుచున్నది.

## కుమ్మరిగూడెము ముత్యాలమ్మ గుడి

(సికింద్రాబాదు)

అనేకవత్సరములనుండి యెంతప్రయత్నించిన ను సాత్వికారాధనంకగీకరించని యీప్రాంత యాల యము యీవత్సరమున శక్తసాత్వికపూజ కంగీక రించినదని తెలుపుట కెంతయు సంతసించుచు న్నాను.

వందలకొలది మేకలు కోళ్లు తెగనరుకబడి రక్తప్రవాహములచే భీభత్సంగా పాలికలనువోలె గన్పట్టెడి యీరంగము యీవత్సరము కనులబం డువై యెట్టిరక్తపాతములేక పప్పుని తోరణముల తో బియ్యపు వంటలతో దేవి యర్చింపబడినది.

దున్నలబలి యొసంగుటకుబదులు గుమ్మడికా యలను దేవికిబలి గానొసంగిరి. ఇంతటిమార్పునకు కారణము గుడిధర్మకర్తృత్వమువహించిన జక్కు లకుటుంబము వారియుదారగుణము. వీరిని సరియై నమార్గంబునకు బుచ్చొల్ప నెంతయో యత్నించిన శ్రీయుతులు మల్లయ్యగారును కుమ్మరిగూడెమునవ యువకులచేస్థాపింపబడి సాంఘిక సేవయందు ముం దడుగువైచుచు దేశోన్నతికై సర్వవిధములయత్నిం చుశ్రీయువజనోన్నత సంఘమువారునుపరోపకారి ణీసంఘమువారునుసల్పిన యపారకృషిఫలితము. ఆజగధీశ్వరుడు వీరికి సంపూర్ణాయురారోగ్యైశ్వ ర్యాదులొసంగి రక్షించుగాక,

అ. వే. దత్తాత్రేయశర్మ.






Kuad and sons

# అభేద్యములైన జిబ్రాల్టరుకోటలు

## బ్రిటిషుసామ్రాజ్యమునకు రక్ష

మధ్యధరా సముద్రముయొక్క పశ్చిమద్వారమైన ట్టియు, బ్రిటిషువారి క్రింద నున్నట్టియు జిబ్రాల్టరు యిటీవల విమానదాడులకు గురియయ్యెను కాని బ్రిటిషువారిఫిరంగులు జవాబుచెప్పి శత్రు విమానములను పారదోలెను ఈ ౨౦౦ సంవత్సరములనుండియు జిబ్రాల్టరులోనున్న బ్రిటిషు ఫిరంగులు శత్రువులపై అగ్నివర్షము గురిపించుచు, వారిని భస్మముచేయుచుండెను. ఇప్పుడు గూడనవి అట్లేచేసినవి.

జిబ్రాల్టరు పెట్టనికోట, మూడువైపుల నది సముద్రమునకు ౧౪౦౦ అడుగుల ఎత్తుననున్నది. పశ్చిమమున యితరవైపులకంటె కొంచెము చదునుగా నుండుటచేత, ఆవైపునుండి తప్ప ఇతర దిక్కులనుండి జిబ్రాల్టరుకు రా వీలులేదని చెప్పవచ్చును. ఈ పశ్చిమదిక్కున పట్టణరేవుస్థలములవలనను పార్బరువలనను, సంరక్షింపబడుచున్నది, వీనిపై అర్జికిరాస్ బేమీదుగా టరీఫావైపుచూచు ౯ అంగుళముల ఫిరంగులున్నవి. ఈ టరీఫావద్ద ౮ వ శతాబ్దములో మహమ్మదీయులు (మూరులు) మొదటదిగిరి. అప్పుడు ఈ ప్రదేశము "కాల్పె" అనబడుచుండెను. టారిక్ అను సేనానాయకునిక్రింద మహమ్మదీయులు భూమిమీదుగా వచ్చిపట్టుకొనిరి. సేనానాయకుని పేరు టారిక్ అగుటవలన దానికి జిబల్‌టారిక్ అనగా టారిక్‌కొండఅని నామకరణముచేయబడెను. కాని ఈనామ లాటినియావద్ద కష్టప్పుపాద్దమీదుగా జిబ్రాల్టరు పట్టుకొన నెవ్వరైనను వాంఛించుచో నతనివాంఛలు సాగనీయబడవు

ఈ కొండకంతటికిని ఈ ఒక్కవైపు అన్నివైపులకంటెగూడ యెక్కువబాగుగా రక్షింపబడియున్నది. ౧౭౭౯—౧౭౮౩ సంవత్సరముల మధ్య ఈకొండ ముట్టడింపబడినప్పుడు కొండను తొలచి గాలరీలుఅని పిలువబడు గుహలునిర్మింపబడెను. ఈగుహాతలలో గొప్పమరఫిరంగులు దాచియుంచబడినవి. ఈవైపుగా శత్రువెవ్వడైనను వచ్చుచో ఈఫిరంగులు వానినిహతమార్చును. ఇచటనే జలాశయములుగూడ కలవు. ఈకాలమున నెవ్వరయినను ఈకొండను నవీన పరికరములతో ముట్టడించినను యెంతకాలమువరైనను పరిపోవునీయకలదు.

ఈకొండ కన్నివైపుల తీరశతఘ్నికలుకలవు ఎక్కడ కొండఉన్నతముగా నుండునో. ఎక్కడ కోణముండునో అచ్చటగొప్పఫిరంగులమర్చబడియున్నవి. నౌకాదళ మేదియైనను జిబ్రాల్టరు మీదికివచ్చుచో తీరశతఘ్నికల అగ్నివర్షమునకు గురియై. తరువాత హార్బరులోనికి రావలసియుండును. హార్బరులోనికివచ్చుచో నచ్చటనున్న గొప్పయుద్ధనావలు శత్రువుపై నగ్నివర్షముకురిపింప సిద్ధముగానుండును. ౧౭౮౨సం॥లో ఫ్రెంచిస్పెయిను యుద్ధనావలుకలిసి హార్బరులోనికి రాబయల్దేరింపగా జనరల్ సర్ జార్జిఎలియటువానిని నాశముచేసెను, స్పెయినువారును. ఫ్రెంచివారును యుద్ధనావలలోరాగా తీరశతఘ్నికలుకురిపించిన అగ్నివర్షముచేనవి భస్మమయ్యెను.

జిబ్రాల్టరు అభేద్యమైనదని దానిచరిత్ర చాటుచున్నది. ౧౭౦౪సం॥లోమాత్రము ఇంగ్లీషు, డచ్చివారుకలిసి దానినిపట్టుకొనిరి ౧౭౧౩వ సంవత్సరములోనది ఉట్రెక్టుసంధిద్వారా బ్రిటిష్‌వారికొసంగబడెను. అప్పటినుండియు యితరులు దానినియెటులైన కాజేయవలెనని ప్రయత్నించుచుండిరి. ఫ్లారిడాను, లేక పోర్టోరికోను పుచ్చుకొని జిబ్రాల్టరును ఇచ్చివేయవలెనని ఎల్లరుపిట్టు ఆలోచించెను, కాని ఆంగప్రజలు అందున కెంతమాత్రము నంగీకరింపకపోయిరి.

సెపోలియను సమయములో యిదినౌకాశ్రయము గాపనికివచ్చెను. ఓడలు చెడిపోయినచో మరమ్మతుకు యిచ్చుటకిపంపబడెను. నౌకలకు సప్లయిలైనకావలసినచో యిక్కడినుండియే సప్లయి చేయబడెను ట్రఫాల్గర్ యుద్ధములో జయించిన నెల్సను తనప్రాణములను బాసినపుడు అతనికళేబరమిచ్చటికే తీసికొనిరాబడెను. ఈనాటికినిఅయన కళేబరము నుంచినగది చూడవచ్చును. ప్రసిద్ధ ఆంగ్లనౌకాధిపతులగు డ్రేకుహోవర్డు, బ్లేకు, హాక్ రూక్, మున్నగువారి యుద్ధబలములు జిబ్రాల్టరు నుండియే కొనసాగింపబడినవి.

### ఆర్థిక క్లేశము

ఆర్థికముగా జిబ్రాల్టరు కొంచెము కష్టస్థితి యందున్నది, ఈస్థలముల ద్వారాను, క్రౌనురెంట్ల ద్వారాను, పోగాను, మద్యదిగుమతి సుంకముల ద్వారాను లభించుచున్నది. ఇప్పుడుఇది కేవలము సముద్రమార్గమున కేర్పడినకోటమాత్రమే యగుటచేత ఈవ్యాపారము చాలవరకు తగ్గింబబడినది, ఐననుపశ్చిమమధ్యధరాసముద్రములోనికి వెలుపలికినిబోవు నావలు శత్రువులను సరకులనుతీసుకొని వెళ్ళకుండ సోదాచేయుట యిక్కడజరుగుచున్నది. ఇటలీయుద్ధములోనికి ప్రవేశించినతరువాత అదిపూర్వముకంటె అభేద్యమైనదిగా చేయబడినది, కనబడు శత్రునౌకను దేనినైనను శతఘ్నికలు నుగ్గునుగ్గుచేయగలవు. బ్రిటిషునౌకాబలముచే నదిరక్షింపబడనిచో యుద్ధసమయమున నిచ్చటికికావలసిన ఫలములు, మాంసము, శాఖములు దిగుమతియగుట కష్టమగును. ఈవస్తువులు స్పెయిను లేక మొరాకోలనుండి దిగుమతియగుచున్నవి, ఈకొంచెము చిన్నది ఎక్కువగాఏమియు పండవు. ఇక్కడ ఎండకాలముతప్ప అన్నికాలములు సుఖముగాను, హాయిగానుండును. ౫౦సంవత్సరములనుండియు ఆరోగ్యశాఖాధికారులు గైకొన్నచర్యలచే ఇంగ్లండుకంటెగూడమరణసంఖ్య తక్కువగానున్నది.

ప్రదేశము కొండప్రదేశమైనను చెట్లు పుష్పజాతులు, తోటలు, విశేషము గాకలవు.

జిబ్రాల్టరు మధ్యధరాసముద్రమునకు పశ్చిమద్వారము, పూర్వకాలమున ఫోనీషియనులు కార్తజీనియనులు, గ్రీకులుదీనితో వ్యాపారముచేసిరి. తరువాత రోమనులు దనిని ఆక్రమించుకొనిరి, తరువాత మహమ్మదీయులు వశముచేసికొనిరి, స్పెయినురాజు ఫెర్డినాండు, ఇసబెల్లారాణిగారి సమయమునయిది స్పెయినువారిచే మరల వశపరచుకొనబడెను. ౧౭౦౪ సం॥లోనిది బ్రిటిషువారిచే పట్టుకొనబడెను, అప్పటినుండియు తనసామ్రాజ్యమును కాపాడుకొనుటకు జిబ్రాల్టరు బ్రిటిషువారికి ఉపకరించుచున్నది.

---



---

## ఉద్ధామసింగు ఉరి

ఉద్ధామసింగు జూలై ౩౧ ఉదయము ౯ గంటలకు ఉరితీయబడెను,

---

## కాంగ్రెసు భావిగతి

### కాంగ్రెసు అధ్యక్షుని అభిప్రాయము

మహాత్మాగాంధిగారి నాయకత్వమును వదలకొనుండుటకై కాంగ్రెసు చాల ప్రయత్నించెను. కాని ప్రస్తుతము ఆప్రయత్నము సఫలము కాలేదు! తిరిగి పోరుసాగించుట అవసరమయినపుడు మహాత్ముని నాయకత్వము లభింపకున్నచో కాంగ్రెసే నాయకత్వ బాధ్యత ఆతయు వహించునుఅని కాంగ్రెసుఅధ్యక్షులు మౌలానా ఆజాదుగారు విలేఖరుల సమావేశమునందు తెలిపిరి.

తిరిగి పోరుసాగించు విషయమున కాలనిర్ణయముండుట మంచిదనియే వారి అభిప్రాయము. "ఊరక కూర్చోలేము. ఎంతకాలమో నిర్ణయము లేకుండా వేచియుండజాలము." అని వారు తెలిపిరి.

అహింసయందు పూర్తివిశ్వాసముగలవారు కాంగ్రెసును వీడవలసిన అవసరములేదని అధ్యక్షులు తలచిరి. మహాత్మా గాంధిగారు వైదొలగియున్నపుడు కాంగ్రెసులో యితరులందరును కలసియుండుట మరింత అవసరమనిరి.

స్వాతంత్ర్యసాధనకై తిరిగి పోరుసాగించుటకు సాంఘిక సఖ్యమునుగూర్చిన ఒడంబడిక ఉండితీరవలెనాయని అడుగ, అట్టిసఖ్యతయున్నచో కార్యము సులభమగును. కాని పోరుప్రారంభించుటకుముందు రెండుమతాలకు సఖ్యత కుదిరితీరవలెనను నిర్ణయముండ నక్కరలేదనిరి.

---

## మద్రాసు విద్యాపీఠములో సైనికశిక్ష

చెన్నపురి, అగస్టు ౭

మద్రాసు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులగు సర్ మహమ్మదు ఉస్మాన్‌గారి అధ్యక్షతను నేడు పుదయం ౧౧—౩౦ గంటలకు సమావేశమైన మద్రాసు సెనెటుసభలో శ్రీ ఎన్. డి. వరదాచారిగారిచే ప్రతిపాదింపబడిన ఈక్రిందితీర్మానము అత్యధిక సంఖ్యాకులచే ఆమోదింపబడెను.

"మద్రాసు విశ్వవిద్యాలయములోను. ఈవిశ్వవిద్యాలయముక్రిందనున్న ప్రతికాలేజిలోను, విశ్వవిద్యాలయకోర్సుతర్ఫీదుపొందుచున్న విద్యార్థులందరకు, యూనివర్సిటీ ట్రెయినింగు సైనికదళము నేర్పరచి, నిర్బంధముగ అన్నియుధములందును శిక్షణ నివ్వవలెననియు, స్త్రీ విద్యార్థినులందరికిని నర్సింగ్ శిక్షణనిచ్చుట అవసరమనియు ఈసభవారు కోరుచున్నారు

---



---

సంవత్సరము చందా
౮ వాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౪-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions
Best Medium
for
Advertisement

Volume 15 | Hyderabad-Dn. | Thursday 15 August 1940 | Number 30

## ఇటలీ కొక క్రొత్త చిక్కు

### ఇటలీయులపై అల్బేనీయుల తిరుగుబాటు

ఇటలీకొక క్రొత్తచిక్కు వచ్చినది ఇటలీయ సైనికాధికారు అల్బేనియాలో అనేక తరగతుల జనులను సేనలలోకిచేర్చుకొనుటకు యత్నించి, పశువులను, ఆహార పదార్థములను అల్బేనీయులు ఇటాలీయసేనలకీయవలెనని ఆజ్ఞాపించగా, అల్బేనీయులు అగస్టు౧౪వ తేదినాడు జుగోస్లావుసరిహద్దు వద్ద తిరుగబడిరనుసంగతి ఇపుడిపుడే బయటపడినది: ఇటలీయులు తిరుగుబాటునణచుటకు సేనలను పంపిరట. ఆసేనలు చర్నగైగొనులోగానే ఇద్దరుఇటాలీయాధికారులు ఒకసమాధానముకు వదుర్చుకొనుటకు సమ్మతించిరి తిరుగబాటులో౧౦౦ ఇటాలీయులు మరణించిరి,

#### తిరుగుబాటు వ్యాప్తి

ఇట్టితిరుగుబాటులే మాకీ జిల్లాలోను రుమేనియాసరిహద్దు నానుకొనియుండు అల్బేనియా సరిహద్దువద్దను ఇటలీయులకును అల్బేనీయులకును జరిగినవి జోగ్ రాజుగారు పుట్టినచోట ౫౦౦౦ మందియు, మరియొకపట్టణములో 3౦౦౫మందియు అల్బేనీయులు తిరుగబడియున్నారు ఈతిరుగుబాటుఇట్లే ఇతరస్థలాలకును వ్యాపించుచున్నట్లు తెలియుచున్నది. అందుచే మూడు ఇటాలీయ నౌకలనిండుగా సేనలు అల్బేనియాకు పంపబడుచున్నవి.

ఇదిఇట్లుండగా ఇటాలీయులు అల్బేనీయులకు గ్రీసుపై ద్వేషముకలిగించు ఒకవార్తను ప్రచురించినారు. టొటుహోగియాఅను అల్బేనీయదేశభక్తుని గ్రీసుఅల్బేనియాలమధ్య సరిహద్దువద్ద ఎవరో గ్రీక్కులచే నియుక్తులైనవారే చంపించినారట ఈదేశభక్తుడు సరిహద్దులోనుండు క్లొమారియాను అల్బేనియాకీయవలెనని ఆందోళనచేయుచుండుటచే, అతనినిపట్టికొన్నవారికి, బహుమతి నిచ్చెదమని గ్రీసువారు ప్రకటించియుండిరి ఇపుడు గ్రీసుఅధికారులు ఆదేశభక్తునితలకొనీ క్లొమారియాలో గ్రామాలన్నిటిలో దేశభక్తులకు చూపించి బెదరించిరట.

### ఇటలీ- బ్రిటనుల యుద్ధము

ఇటలీబ్రిటనుల యుద్ధములో చెప్పదగిన విశేషములేవియులేవు. ఆఫ్రికాలో ఇటలీసేనలింకను లిబియాసరిహద్దులు దాటలేదు. సోమలిలాండులో ఇటలీసేనలు హార్గీసానుండియు ఓడ్వినానుండియు ఉత్తరముపైపు పోవుచుండినట్లు వినియుంటిమిగదా అంతకుపైన ఇటాలీయులు ముందుకు నడువలేదు. అగస్టు౯వ తేదినాడు బ్రిటిషు సేనలు కొరిన్టిలును పట్టకొనగల్గిరి,

బ్రిటనుపై జర్మనీవిమానాలదాడులు ఒకవారమురోజులనుండి ఉద్ధతిలోనున్నవి. ఈదాడలనుగూర్చి బ్రిటిషువారు ప్రకటించువార్తలన్నిటిలో బ్రిటిషుపోరాటపువిమానాలను చూడగానే జర్మనీవిమానాలు పారిపోవుచున్నట్లును, జర్మనీవిమానాలు అనేకములు బ్రిటిషువారిచే క్రిందకూల్చబడుచున్నట్లును బ్రిటిషువారికి చాలతక్కువనష్టములు మాత్రమే కలుగుచున్నట్లును గలదు జర్మనీవిమానాలు హెచ్చుగానున్నను, వాటితో తక్కువసంఖ్యలోనున్న బ్రిటిషువిమానాలు పోరాడి గెలుచుచునేయున్నవి.

అగస్టు౮వ తేదిడోవరుపైజర్మను విమానాలకును బ్రిటిషువిమానాలకునుజరిగినయుద్ధంలో ౬౫ జర్మనువిమానాలునాశనముచేయబడినవి బ్రిటిషువారివి౧౬మాత్రమేనష్టమైనవి మొత్తము౪౦౦జర్మనువిమానాలుపోరాటంలోపాల్గొన్నవి ఇంగ్లీషుఛానలులోజర్మనులచేఓడలుముంచబడినవి ౭ ఓడలకుదెబ్బలుతగిలినవి ఒకజర్మనుమోటారు బోటుసీటముంచబడెను.

అగస్టు౮వ తేదిమధ్యాహ్నము ఒక జర్మనవిమానము ఇంగ్లాండుఈశాన్యతీరముదాటివచ్చి పేలుడుబాంబులనువేసెను రాత్రిపూటజర్మను విమానాలు ఇంగ్లాండు నిబుబుతి దిగ్భాగములో బాంబులువేసెను

అగస్టు౯వతేదీ ఉదయము ఇంగ్లాండు ఈశాన్యదిశలో జర్మనువిమానాలువచ్చి బాంబులు వేసెను.

అగస్టు ౧౦వతేది ఉదయము ఇంగ్లాండు ఈశాన్యప్రాంతములోను, ఆగ్నేయ ప్రాంతములోను ఆదేరాత్రి వాయవ్యప్రాంతములోను జర్మను విమానాలు బాంబులువేసెను.

అగస్టు ౧౧వతేది ఇంగ్లాండు దక్షిణ సముద్రతీరాలలోను ఉదయము మొదలు ४౦౦ జర్మనువిమానాలు బ్రిటిషుఓడలపై బాంబులువేసెను ఉదయం మొదలుకొని ४ సార్లు నాలుగుచోట్ల జర్మను విమానాలను బ్రిటిషువారెదుర్కొని పోరాడవలసివచ్చెను పోర్ట్లెండు, డోవరు, తూర్పుఇంగ్లాండుతీరము..... ఇవి పోరాటపు ముఖ్యస్థలాలు మొత్తము ౬౦ జర్మనువిమానాలు నష్టమయ్యెను ౨౬ బ్రిటిషు విమానాలు నష్టమయ్యెను

#### అర్థమైలు నాశనం

ఇంగ్లాండు నిబుబుతిభాగంలో ఒక పట్టణంపై జర్మను బాంబులువేయగా అర్థదదరపుమైలువరకు జనులు దట్టముగానుండు ప్రదేశములో ఇండ్లన్నియు నాశనమైనట్లువార్తవచ్చినది

అగస్టు ౧౨వతేదికూడ ఉదయము మధ్యాహ్నము సాయంకాలము రాత్రులలో జర్మను విమానాలు బ్రిటనుపై దాడివెడలినవి ముఖ్యపోరాటస్థలాలు థేమ్సునదీ ముఖద్వారము, ఇంగ్లీషు ఛానలు, పోర్ట్సుమౌతు మొత్తము ౫౦౦ జర్మను విమానాలతో పోరాడినట్లయినది ४౬ జర్మను విమానాలు నాశనము చేయబడినవి ౯ బ్రిటిషు విమానాలు నాశనముచేయుబడినవి

అగస్టు ౧౩వతేది ఉదయము కెంటెకోస్టు! ఐల్ ఆఫ్ఐయిట్, పోర్ట్సుమౌత్- వీటిపై జర్మనువిమానాలు బాంబులు వేసెను

ఇంగ్లాండు ఈశాన్యతీరంలో అగస్టు ౧౩వ తేది ఉదయం బ్రిటనుజర్మనీవిమానాలకు గొప్ప పోరాటముజరిగెను.

### జర్మనీపై బ్రిటిషువిమానాలు

అగస్టు ౭వ, ౯వ, ౧౦వ, ౧౧వ, ౧౨వ తేదులలో జర్మనీపైనను, జర్మనీ ఆక్రాంత ప్రదేశాలపైనను బ్రిటిషువిమానాలు ఎప్పటివలెనే ఉదయము, మధ్యాహ్నము, రాత్రిల్లు తిరిగి సైనిక ప్రాముఖ్య ప్రదేశాలపై బారులువేసినవి జర్మనీవారి పొర్బరులలో మందుగనులు కూడ వేసెను.

### ఫ్రాన్సు ప్రభుత్వముపై తిరుగుబాటు

ఫ్రెంచిసామ్రాజ్యంలో చేరిన న్యూహిబ్రిడీసు ప్రభుత్వమువారు ఫ్రెంచి ప్రభుత్వానికి ఎదురుతిరిగి జనరల్ డీగాల్ గార్ క్రింద బ్రిటనతో కలిసి జర్మనీపైపోరాడగలమని డీగలుగారికి తెలియజేసినారు ఇందువల్ల ఈరాజ్యంలోనుండి పోవు కొబ్బరి, ప్రత్తి, కాఫీ ఎగుమతులు బ్రిటనుకు లభించును

ఫ్రెంచిమొరాకోలో ప్రజలు పెతైనుగారి ప్రభుత్వమునకు విరుద్ధముగానే ఉన్నారు

తుర్కీకిని పాలెస్టయినుకును మధ్యనుండు ప్రదేశంగ ఉన్న సిరియా ఫ్రెంచిసేన దీని సరిహద్దులు దాటి సేనలో పనిచేయ దిగినవయస్సుగల బ్రిటనులు ముస్లిమువారెవరు రాదగయు పోకూడదనియు ఇప్పైను ప్రభుత్వము వారు నిషేధించినారు

## ప్రాచీన జైన బౌద్ధశిల్పములు

### బయటపడినవి

నిజామాబాదు అగస్టు ౭

నిజామాబాదు మన్మాడు రైలు రైనులోని స్టేషనుస్థలము నిజాంరాష్ట్రములోని తెలంగాణా జిల్లాలలో నొకటి ఇది చరిత్రాత్మక మయినది ఈనగరం తూర్పువైపున ఒక విశాలమయిన పురాతన కోటగలదు అది చాలా శిధిలావస్థలోనున్నది ఆట్టికోటనునిజాం సర్కారు వారు అకోటయందు మట్టిని త్రవ్వివేలము వేయుచుందురు ఈ మట్టిని ఇటీవల త్రవ్వుచుండగా దానిలోనుండి కొన్ని శ్వేతశిలా విగ్రహములు బయలుపడినవి, ఆ విగ్రహములు చాలా చూపరులకు ఆనందము కలుగచేయుచున్నవి. అట్టివిగ్రహములు దొరకినవెంటనే సర్కారువారి యుద్యోగులువచ్చి వాటిని స్వాధీనములో పెట్టుకున్నారు. నిజామాబాదు సుమారు ౨౨ వేలు ప్రజాసముదాయముగల పట్టణం. యిచ్చట దొరకిన శిలావిగ్రహములు మొత్తము ౧౪. ఆ ట్టివిగ్రహములు మేము పూజాపురస్కారములు చేసుకొందుము అవిమాకు ఇవ్వవలసినదిగాకోరుచూ, శ్రీమాన్ కందాడచిన క్రిష్టమాచార్యులు వారి అధ్వర్యమున ఆయిదారు వందలసంతకములతో ఒక వినతి స్థానికాధికార్లకును మతశాఖవారికిని యిచ్చినారు. ఇంతవరకు ఏవిధమయినసమాధానము మాకురాలేదు ఈవిగ్రహములు ౨౯ జులై ౧౯४౦ తేదీనబయలుపడినవి. నేటివరకు ప్రజలు తండోపతండములుగా వచ్చిచు చిపోవుచున్నారు

ఇట్లు
యస్. యల్. శాస్త్రి
నిజామాబాదు (దక్కను)

(గమనిక — పైలేఖకుడు విగ్రహాల ఫోటోను మాకుపంపినాడు. దానిబ్లాకే ఇందు ముద్రితము గో. ప)

## శత్రుబిరుదాల నిషేధము

హైద్రాబాదు (దక్కన్) సెహరీ ప్రభుత్వ ప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు:—

ఇండియా చక్రవర్తిగారి ఆజ్ఞప్రకారము జర్మన్, ఇటాలియన్ గౌరవ బిరుదుచిహ్నములను బ్రిటిషుప్రజలు పైరెండుదేశాలలోనివారు ఇకముందు ధరించగూడదు. ఇదివరలో ఇచ్చిన సెలవు ఇప్పుడురద్దుచేయబడుచున్నది

## ఆంధ్ర యువజన సమితి

హైదరాబాదు(దక్కన్),
అగస్టు ౧౧,

ఆంధ్రయువజనసమితి మహాజనసభవారు ప్రజాభిప్రాయమునకై పంపబడిన బాల్యవివాహ నిరోధక చట్టమును ఏకగ్రీవముగ ఆమోదించుచు వెంటనే ఆచరణలో పెట్ట ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు భారతదేశపు యితరప్రాంతములలో యిటువంటిచట్టమెన్నడో అమలులో పెట్టబడియుండ హైదరాబాదువంటి పెద్దసంస్థానములో యిటువంటిచట్టములేకుండుట గొప్ప లోపమనియు బాలబాలికల ఆరోగ్యమునకు గొప్ప అనర్థదాయకము మరియు దేశసౌభాగ్యమునకు గొప్ప ఆటంకమనియుగ్రహించి, యిప్పటికైనను ఆక్షేపణలలెక్కపెట్టక ఈచట్టమును ఆచరణలో పెట్టుటకు ఈ సంఘమువారు ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు.

కే. మాధవరెడ్డి
కార్యదర్శి,

## మున్నూరుకాపు నవయువక మండలి

(హైదరాబాదు)

ప్రకటన

పై మండలియొక్క మహాజనసభ (General body) ఈశ్రావణ ౭॥ ౧౨ శుక్రవారము (౩౦-౭-४౦) నాడు జరుపుటకు నిశ్చయింపబడినది కావున మండలిసభ్యులు ఆనాటిసభలో ప్రవేశపెట్టదలచిన చిత్తుతీర్మానములును, నియమావళి సవరణలును ఈ శ్రావణ బ ४ గురువారము (౨౨-౮-४౦)వరకు మండలికార్యాలయమునకు పంపవలెనని కోరుచున్నాము

౨౧౫౦, ఈసామియా బజారు, హైద్రాబాదు—దక్కను — ఇట్లువిధేయుడు, సంగిశెట్టి బాబయ్య సహాయకార్యదర్శి

ఫ్రాన్సులో కొన్నిపత్రికలవారు బ్రిటనునుండియు రష్యానుండియు కొందరివల్ల లంచాలు తీసికొని ఫ్రెంచిప్రజలలో యుద్ధము సాగించవలెననుభావము వ్యాపించేటట్లు వ్రాసినారను ఆరోపణతో కొందరు పత్రికలవారలను ఫ్రెంచిప్రభుత్వము వారు ప్రత్యేకంగా ఏర్పరచిన సుప్రీం కోర్టువారివిచారణకు అప్పగించనున్నారు

### రుమేనియా వ్యవహారము

రుమేనియా ఆఖరుకు హంగరీ, బల్గేరియాలకు కావలసిన భూభాగాలను కొద్దియోగొప్పయో యివ్వకతప్పేటట్లులేదు ఇవ్వకుండా హంగరీతో పోరాడుచో అటుజర్మను ట్రాన్సిల్వేనియాను ఇటురష్యా కార్పేధియనులకు దక్షిణ పశ్చిమప్రాంతమును రుమేనియానుండి ఆక్రమించుకొనవచ్చునను భయము. ఇప్పుడుకినపడుచున్నది అందుచేసంధిద్వారా వ్యవహారంకుదుర్చుకొను ౹ రుమేనియా రాజు బల్గేరియా రాజును కలిసిమాట్లాడుటకై అగస్టు ౧౦వ తేది ప్రయాణమైనాడు



Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor- S Prathapa Reddy B. A. P. L